శ్రీ రాఘవేంద్ర గురుభ్యోనమః

# సప్రమాణ జ్యోతిస్సారము

## షష్ఠమ తరంగము

## [] ప్రశ్నోత్తరములు []




రచయిత:

వంశ పరంపరానుభవవైద్య, జ్యోతిషరత్న, వాస్తు స్వయంభువు

శ్రీమాన్ తిరుమలనల్లాన్ చక్రవర్తుల

## వేంకట వరదాచార్యులు

బొందలదిన్నె పోస్టు
తాడిపత్రి బ్రాంచి

తాడిపత్రి తాలూకా
అనంతపురం జిల్లా.



**1988**

ప్రథమ ముద్రణ; 300 ప్రతులు.

వెల: రు. 7-00


---

శ్రీ రాఘవేంద్ర గురుభ్యోనమః

# సప్రమాణ జ్యోతిస్సారము

## షష్ఠమ తరంగము

## [] ప్రశ్నోత్తరములు []






ర చ యి త :

వంశపరంపరానుభవ వైద్య, జ్యోతిషరత్న, వాస్తు స్వయంభువు

శ్రీమాన్ తిరుమలనల్లాన్ చక్రవర్తుల

## వేంకట వరదాచార్యులు

బొందలదిన్నె పోస్టు
తాడిపత్రి బ్రాంచి

తాడిపత్రి తాలూకా
అనంతపురం జిల్లా.



**1988**

ప్రథమ ముద్రణ; 300 ప్రతులు.

వెల: రు. 7-00


---

శ్రీ రాఘవేంద్ర గురుభ్యోనమః
శ్రీ లక్ష్మీ నృసింహాయనమః
శ్రీ శారదా దేవతాభ్యోనమః

# సప్రమాణ జ్యోతిస్సారము

## షష్ఠమంతరంగము నానా విధ ప్రశ్నోత్తరములు



శ్లో॥ శివం హరిం విధాతారం తత్పత్నీన్ తత్సుతాన్ గురూన్
నత్వాసమస్త ప్రత్యూహ శాంతయే మంగళాయచ.

శ్రీ స్వామి, దైవ నిర్మితములు. వేదములని మానవ నిర్మిత ములు, పురాణములని, (అపౌరుషేయములు - పౌరుషేయ ములు). అని చెప్పుచున్నారు, జ్యోతిశ్శాస్త్రము, దైవ నిర్మితమో, మానవనిర్మితమో, తెలుపుడు.

గు— వత్సా! సృష్ట్యాదిలో యీలోకపాలనకు అష్టదిక్పతుల సృష్టించి అటుపై నవగ్రహముల సృష్టించినారు. విష్ణు అంశముతో ఇంద్రుడు, యముడు, ఈశాన్యుడును, ఈశ్వరాంశతో, అగ్ని, వరుణుడు, కుబేరుడును, బ్రహ్మ అంశముతో వాయువు నైరుతి ఈశ్వరాంశములో చేరును. ఈశాన్యుడు శివుడని చెప్పుచున్నారు. అట్లయిన విష్ణు అంశముతో ఇంద్రుడు యముడు మాత్రమే అగుదురు, ఇదియేదో విపరీతముగ నున్నది, ఇక నవగ్రహములలో విష్ణు అంశతో సూర్యుడు, కుజుడు, బృహస్పతి, కేతువు ఈశ్వరాంశముతో శుక్రుడు రాహువు, శని, బుధుడును బ్రహ్మ అంశతో చంద్రుడు

సృష్టి అయినారు. ప్రకృతము గ్రంథకారకులు నిర్మాణ కారకులు. తూర్పున కధిపతయిగు సూర్యుని, మధ్యకుమార్చి, అగ్నిమూల కధిపతియిగు శుక్రుని తూర్పున నియమించి, వాయువ్య దిశాధిపతియగు చంద్రుని, ఆగ్నేయమునకు మార్చినారు. రాహువుకు ఎదురుగా నుండవలసిన కేతువును వాయువ్యమున వేసినారు. ఉత్తరమునకు అధిపతియైన బుధుని ఈశాన్యమునకు ఈశాన్యమున కధిపతియైన గురువును ఉత్తరమునకు మార్చి నవగ్రహ మండలము ఏర్పరచినారు. ఈ విధముగా జ్యోతిశ్శాస్త్రమున అంతర్భాగమైన వాస్తును చెప్పిన పృచ్ఛకుడు వప్పుకొనడు. శాస్త్రము అశాస్త్రీయమగును, జోస్యుని మాట వమ్మగును. ఇది, ఇట్లగుటకు కారణము కలిపురుషుని మహాత్మ్యము. శాస్త్రజ్ఞులు కవులు అన్యమార్గముల సృష్టించవలసినవిధి, శాపానుగ్రహ శక్తిగల బ్రాహ్మణులు కనుమూయవలసిన కాలము.

వత్సా! వారితో నీకు పనిలేదు. నీ దారిన నీవు పోయిన దృక్కుకు వచ్చును. శాస్త్రమునకు ప్రాణము వచ్చును. గమనించు తూర్పునకు సూర్యుడు అగ్నిమూలకు శుక్రుడు, దక్షిణమునకు, కుజుడు, నైరుతీమూలకు రాహువు, పశ్చిమమునకు శని, వాయువ్యమూలకు చంద్రుడు. ఉత్తరమునకు బుధుడు ఈశాన్యమూలకు గురువు భూమికి కుజుడు, గగనమునకు చంద్రుడు, ఇట్లున్నది, ఇక్కడికి దశ దిక్కులయినవి. చతుర్థమును ఏ గ్రహము చూచునో ఆ విధముగా ఆ భూమి ( ఆ సర్వేనంబరు ) పుండును - సూర్యుడుండినా చూచిన వలయాకారము-శుక్రుడుండిన పంచ కోణములతో నుండును, కుజుడు చూచిన పుండిన, త్రికోణాకారము,

రాహువుండిన శూర్పాకారము, (చాట) శని చూచిన వుండిన ధనురాకారము, చంద్రుడుండిన చూచిన, సమచతుష్కోణా కారము-బుధుడుండినా చూచిన బాణాకారము, గురుడుండిన చూచిన దీర్ఘ చతుష్కోణాకారముగా స్థలముండును. రెండు మూడు గ్రహములుండిన, ఆయా దిశలలో వారి వారి ఆకారములుండును.

శ్రీ— స్వామి ఈ మానవలోకము. పాప పుణ్య మిశ్రితమన్నావు గద. ఊర్ధ్వలోకములు శుద్ధ పుణ్యలోకములన్నావు గద. ఆ లోకములో వారే గద. రవి, కుజ, శని, రాహు, కేతు గ్రహములు పీరినేందుకు నైసర్గిక పాపులన్నారు. సెలవిండు (శుద్ధపాపులు)

గు— వత్సా! ఇది కలిపురుషుని మహాత్మ్యమన్నానుగద. పూర్వులు గ్రహ విభజన, నక్షత్ర విభజన, లగ్న విభజన మొదలగునవి తెలిపిన జ్యోతిష కుటుంబములు వంశ వరం పరగా నశించి పోవుటయు, వారు ఇతరులకు తెలుపక పోవుటయు, గలిగి నందువల్ల ప్రతి కార్యమునకు ఈ శాస్త్రము ఆ ధారమై యున్నది. గాబట్టి కృత్రిమ శాస్త్రమును కల్పించినారు. నామ నక్షత్రము పై ఆధారపడి కాలము త్రోయగలుగు చున్నారు. ఇది శాస్త్రమా, అశాస్త్రీయమా అన్నవారులేరు. తిథివార నక్షత్ర యోగకరణములుపై ఆధారపడి గ్రంధ కర్తలు వ్రాసినారు. వీరు చెప్పుచున్నాను. ఈ పంచ, అంగములకు ప్రాణములేదు. నవగ్రహములవల్లనే స్థావర జంగమములు నడుచుచున్నవని తెలిపిన వారువేరు.

శ్రీ— నక్షత్రములకు అధిష్ఠానదేవతల సృష్టించినారు. నిజమేనందుర

గు— వత్సా! నక్షత్రములపై గ్రహములు లేకుండిన నక్షత్రవులు

యేమి చేయలేవు ఏ దిన నక్షత్రములపై చంద్రుడుండును, అదియే దిన నక్షత్రము. దానిని బట్టి ఫలము చెప్పేవారున్నారు. చంద్రుని బట్టియూ, నక్షత్రమును బట్టియూ, అన్న విమర్శ లేదు. నక్షత్రములకు అధిష్ఠాన దేవతలు లేరు. గను నింపుము: 27 నక్షత్రములు, ద్వాదశ రాశులలో నియమించి ఒక్కొక్క గ్రహమునకు మూడు నక్షత్రముల వంతున పంచినారు. ఆయా గ్రహమునకు గల ఏ నక్షత్రములు వచ్చునో ఆ గ్రహమే వాటికధిపతి. సూర్యునకు కృత్తిక ఉత్తర ఉత్తరాషాడ-చంద్రునకు. రోహిణి, హస్త, శ్రవణం-కుజునకు, మృగశిర, చిత్త, ధనిష్ట, బుధునకు ఆశ్లేష-జ్యేష్ట-రేవతి-గురువుకు, పునర్వసు విశాఖ, పూర్వాభాద్ర-శుక్రునకు, పుబ్బ, పూర్వాషాఢ, భరణి-శనికి, పుష్యమి అనూరాధ ఉత్తరాభాద్ర- రాహువుకు, ఆరుద్ర, స్వాతి, శతభిషం, కేతువుకు, అశ్వని, మఖ, మూల, ఈ విధముగా నవగ్రహములకు 27 నక్షత్రములు పంచినారు. ఇందులో గురు పాలితములని శని పాలితములని, విభజింపబడినవి. మేషరాశిలో భరణి మిధునములో ఆరుద్ర, కటకములో పుష్యమి, ఆశ్లేష, సింహములో పుబ్బ, తులలో స్వాతి, వృశ్చికములో, అనూరాధ జ్యేష్ఠ, ధనస్సులో పూర్వాషాడ, కుంభములో శతభిషము, మీనములో ఉత్తరాభాద్ర, రేవతి ఈ నక్షత్రములు శని పాలితములు-మేషములో అశ్వని, కృత్తిక, వృషభములో మృగశిర-మిధునములో పునర్వసు. సింహములో మఖ ఉత్తర కన్యలో చిత్త, తులలో, విశాఖ, ధనస్సులో, మూల ఉత్తరాషాఢ, కుంభములో పూర్వాభాద్ర, ఇవి గురు పాలితములు-రోహిణి, వృషభములో హస్త కన్యలో, శ్రవణం మకరములో బ్రహ్మపాలితములై యున్నవి. ఆయా నక్షత్రములకు ఆయా



గ్రహములతే పాలించుచున్నవి గాని, అశ్వనికి అశ్వనిదేవతలని, భరణికి యముడని, కృత్తికకు అగ్నియని ఇట్లే అన్ని నక్షత్రములకు, నిర్ణయించినారు. గ్రహములేని నక్షత్రము. మానవులకు సుఖ దుఃఖముల గల్పించినట్లులేదు. గ్రహములెప్పుడు ఆస్థాన బలము గలుగు చున్నదిగాని గ్రహము లేక నక్షత్రము సుఖ దుఃఖముల గల్పించినట్లు లేదు. కొందరు నామనక్షత్రమును గాని, పుట్టిన నక్షత్రమును బట్టి ఫలము చెప్పుచారున్నారు. ఇది కల్పనా కథగాని జోస్యము గాదు.

శ్రీ.— నల్వురు ఒక పేరు యమునారిలో ఉందురు. ఒకడు లక్షాధికారి మరొకడు భిక్షాధికారి ఒకడు ఉద్యోగిగా ఒకడు నిరక్షరాస్యుడుగా ఉన్నారు. నామ నక్షత్రము ఫలము చెప్పుటకు ఎట్లు పనికి వచ్చు నందురు.

గు.— వత్సః తత్కాలలగ్నము నిశ్చయము చేసకొని, చెప్పుటి అభ్యాసమునలేదు పెద్దవారు ఆచరణలో పెట్టలేదు. పూర్వ పండితులు పాదచ్ఛాయవల్ల ప్రొద్దును కనిపెట్టి గ్రహముల ఉండదగినచోట్లలో వేసుకొని లగ్నమును బట్టి చెప్పువారుండినారు. అది మరుగైనది. ఇప్పుడు నామ నక్షత్రమే ప్రధానముగా పెట్టుకొన్నారు. అది జరగదు. పుట్టిన ఉదయముగాని, వచ్చి అడిగిన ఉదయముగాని వుండవలయును. ఇది, ఆచరణలో లేదు; అందువల్ల గురుపాలిత శనిపాలిత లగ్నముల విభజన చేయక పోవుటవల్ల జ్యోతిషము సర్వము చెడిపోయినది. పేరు మానవుని గుర్తించుటకే గాని దానివల్ల సుఖ దుఃఖముల లాభ నష్టముల మానవులు పొందజాలరు. దారి గానక పెడదారిన నడిచినారు. మానవులలో శాస్త్రమున్నదా లేదా అను అనుమానము గలిగినది.

చెప్పినవన్నీ జరుగక పోవుటయే అనుమానమునకు కారణము. ప్రమాణ గ్రంథములట్లున్నవి. వీరేమి చేయగలరు. జన్మ నక్షత్రముతో చెప్పినా నామనక్షత్రముతో చెప్పినా ఫలితము దుష్ఫలమే యగును.

శ్రీ— స్వామి, అనురాధ నక్షత్రము ప్రథమ పాదములో జననమైనాడు. నా సీ సూ నె అనురాధ వచ్చినది. న మొదటి అక్షరము వచ్చునట్లు పేరు పెట్టుకొవ్వాలని చెప్పుదురు. ఇది శాస్త్రీయమే నందురు.

గు— వత్సా! ముందు జన్మమున విష్ణుపరముగా ధ్యానము చేసి, విష్ణు దేవాలయ ప్రదక్షణములు చేసి అర్చనచేయించి నమ్మిన వారు. గురు పాలిత లగ్నములలో పుట్టుదురు. అట్టి వారికి విష్ణు పరముగా పేరు పెట్టుట శ్రేయోదాయకము. శివుని పరముగా గాని ఇలువేల్పు శివుడనిగాని శివుని పేరు పెట్టరాదు. ఇది శిశువుకు మంచిదగాదు. వాడు శివుడు పరముగా ధ్యానము చేయుట సత్యము. ఇవ్వక పాప పరిహార మొనర్చును.

ముందు జన్మలో శివధ్యానము చేసి, శివుని నమ్మి శివాలయములకు పోయి శివునకు అర్చన చేయించినవారు. శని పాలిత లగ్నములలో జనింతురు. వీరికి విష్ణు పరముగా పేరును పెట్టరాదు. వాని పేరు శివయ్య కొలిచేది రామయ్యాను క్రమబద్ధములేని త్రోవయగును. గురు పాలితలగ్నములకు విష్ణు పరముగ, శని పాలిత లగ్నములకు శివుని పరముగా పేరు పెట్టుకొనుట శ్రేయము, నక్షత్రములద్వారా, పేరు నియమించుట శాస్త్రముగాదు. పేరు మానవుని గుర్తించుటకేగాని, దానితో మానవులకు అదృష్ట దురదృష్టముల తెలు

పుట శాస్త్రహీనము, పృచ్ఛకుడు వచ్చి అడిగిన సమయము లగ్నమును బట్టిగాని పుట్టిన కాలమును బట్టిగాని చెప్పవల యుననువారు కరువై నామనక్షత్రము వరకు వచ్చినది. ఇది శాస్త్రమునకు పెనకదెబ్బ, వత్సా! గురుపాలిత శనిపాలితలగ్న విభజన శాస్త్ర కారకులు వ్రాయనందున ఇట్టి అశాస్త్రీయ ప్రమాణములు అనంతముగా తయారైనవని తలంచు.

శ్రీ— స్వామి; శని, గురు, కుజరవులు, లగ్న ద్వాదశ ద్వితీయ అష్టమములలో నుండిన, ప్రాణసందేహం స్థానభ్రష్టం, ధన క్షయం అని శ్లోకమును వ్రాసి యున్నారుగద మకర, కుంభ, వృషభ, మిథున, కన్య, తులా రాసులవారికి శని వచ్చి నపుడు ఈ శ్లోకార్థమునే వాడుచున్నారు. మీన, మేష కటక, సింహ వృశ్చిక ధనుస్సుల వారికి గురు, కుజ రవులు వచ్చినపుడు, ఈ శ్లోకమునే వాడుచున్నారు. ఇది శాస్త్ర మేనందుర

గు— వత్సా! ఇది, శాస్త్రమునకు చీడపురుగు గురు శని పాలిత ముల గమనించిన ప్రమాణ గ్రంథకర్తలు వేరు. అందువల్ల ఈ శ్లోకార్థము. నాశనమై శాస్త్రజ్ఞుం మాట జూటా అయినది గురు పాలిత లగ్నములకు శని శుక్ర బుధ రాహు గ్రహ ములు యెచ్చటున్నను ఆ స్థాన ఫలము దుష్ఫలముగమార్చి బాధింతురు. శని పాలిత లగ్నములకు గురు కుజ రవి చంద్ర కేతు గ్రహములు ఎచ్చటున్నను ఆ స్థాన ఫలము దుష్ఫలముగా మార్చి బాధింతురు. గురు పాలిత శ పాలితముల, స్థాన కార్యకత్వముల గ్రహకార కత్వముల గ్రంథకారకులు చక్కగా తెలుపనందున ప్రకృత జోస్యుల మాట తలక్రిందులగు చున్నదని తెలుసుకొనుము.

శ్రీ- స్వామి గురు పాలితములు శని పాలితములని లగ్న విభజన చేసినారు. శివ పాలితములని వ్రాయగూడదచ,

గు- ప్రకృతజోస్యుల, ప్రశ్నించువారు. నాకు శనిబలము. గురు బలము ఈ సంవత్సరము యెట్లున్నదని అడుగువారున్నారు గురువు, 12 నెలలు, శని 30 నెలలు. ఒక్కొక్క గృహములో నుండువారు. గనుక, గురుబలము శనిబలమునే అడుగుచున్నారు. అందువల్ల శని పాలితమనియే వ్రాయ వలసి వచ్చినది. లగ్నమునకు శని, ఆరింటువుండిన మంచి దని అన్ని లగ్నములకు చెప్పుచున్నాను. గురు లగ్నము లకు ఆరింట శని యుండిన వారి చావు బ్రహ్మదేవుని కెరుక 6, 8, 12, 3, పాప స్థానములు ఈ నాలుగు పాప స్థాన ములవల్ల మానవుని, విపరీతముగ బాదించును. శని పాలిత లగ్నముల కుండిన, ఉన్నంతకాలము మంచి సత్ఫల మిచ్చును. ఇది లగ్నవిభజన దొరుకనందున, తెలియక చెప్పిన, శాస్త్రము అందువల్ల, శని పాలితమనియే వాడ వలసి వచ్చినది. న్యాయముగా శివ పాలితమే యగును.

శ్రీ- స్వామి గొప్ప మేధావులు సైంటిస్టులు కవులు గాయకులు ధనికులు విద్యావంతులు శాస్త్రజ్ఞులు పుట్టుచున్నారు వున్నారు వారికి జ్ఞానశక్తి దేహశక్తి ముత్త్రివిధ శక్తులు కూడియున్నవి. ఏ విధముగ గ్రహబలము కూడి యుండును. ముందు జన్మలో ఏ విధమగు పూజలు చేసి వుందురు. తెలుపగలర.

గు- వత్సా లగ్నాదిపతి దేహశక్తి, పంచమాదిపతి జ్ఞానశక్తి, నవమాదిపతి ధనశక్తి ప్రసాదింతురు. లగ్నమునకు పార్వతి పంచమునకు సరస్వతి, నవమమునకు లక్ష్మి, అదిపతులు. ఈ స్థానాదిపతులు ముగ్గురు. ఒక స్థానములో కలిసిన,

ముప్విధశక్తులు కలుగును, వీరుకలిసిన చోటులోన అంశలోన భేదము గలదు లగ్నమున దేహశక్తి, ద్వితీయమున ధనశక్తి తృతీయమున సోదర సోదరీశక్తి, చతుర్థమున నిర్మాణశక్తి, ప్రభుశక్తి, పంచమమున జ్ఞానశక్తి వల్లగలుగు మహత్తరశక్తులు, షట్ స్థానమున శత్రు రోగఋణ విపత్తులవల్ల లాభము గడించు బలము సప్తమము సత్కళత్రము, గొప్ప లాభము. శ్వశ్రృ గృహము తన గృహమేయగుట (ఇల్లరికము). అష్టమము, దీర్ఘాయువు, గొప్ప పలుకుబడి, నవమము దైవశక్తి, ధనమునిల్వ చేయుట దశమము, ప్రభుశక్తి కీర్తి గౌరవము లలో చిరస్థాయినొందుట, ఏకాదశము దుర్లాభముగా, ఆస్తిలు వచ్చుట, ద్వాదశము. ముక్తిసాధన, విద్యాబలము గలుగును. ముందు జన్మమున, ముప్వేల్పుల నొక్కటిగా చూచి, ముప్వురిని, నమ్మి కొలిచిన వారికిట్టి ముప్విధశక్తుల కలయిక గలుగును. మత ద్వేషములవల్ల, ఒక్కరొక్కరినే కొలిచిన వారికి ఒక్కశక్తే గలుగును. వత్సా. లగ్న పంచమాధిపతులు. లగ్నభాగ్యాధిపతులు ఇట్లు రెండు రెండు గ్రహములు కలిసినవారు కొంతవరకున్నారు వీరుకీర్తి గౌరవములతో జీవింతురు. దశాను కూలతగలవారు. చక్కగా జీవింతురు. గ్రహాను కూలతగలవారు సాధారణముగా జీవింతురు. లగ్నపంచమ నవమాధిపతుల కలయికగలిగి దశానుకూలత లేక పోయి ముప్వురిలో దశలలో ఒకరొకరే పోయినవారు, మధ్య రకముగ, జీవింతురు. దశాను కూలత గలిగి ముప్వురు కూడినవారు, రాను రాను ఈ దేహములో త్రిశక్తులు గలవు. పశు పక్షి క్రిమి కీటకములలో కూడగలవు. వాక్ స్థానమునకు విష్ణువధిపతి, గుద స్థానమునకు ఈశ్వరుడు అధిపతి, మనో స్థానమునకు బ్రహ్మ అధిపతి. ఇట్లే ప్రతి అవయవమునకు ఒక్కొక దేవత నవగ్రహములలో నొక గ్రహము నిలిచియున్నవి. దైవశక్తి నార్జించినవాడు సుఖపడుచున్నాడు, ఆర్జించనివాడు కష్టపడు

చున్నాడు. స్థిరచరాస్తుల సంపాదించి పేరు ప్రతిష్టలతో పుణ్యకార్యములు చేసి జగద్విఖ్యాతి గడించి, కడకు ముక్తిని సంపాదింతురు. ఇందులో గురు పాలిత గ్రహముల కలయిక పరంతుకు పోవు ఆలోచన చేయించి పుణ్యకార్యముల జపతపాదుల చేయించును. ప్రజలకుపరించు వస్తువుల సృష్టింప చేయించును చిరకీర్తిని గడింపచేయును. శని పాలిత గ్రహముల కలయిక ఇహ సంబంధమైన యంత్రముల మారణాస్త్రముల సృష్టింపచేతురు. శాంబరీవిద్యను, యక్షిణీవిద్యను గ్రహింపచేసి, ప్రజలలో కీర్తిని గడింపచేతురు. సకల సౌఖ్యములు లభింపచేతురు. ఇట్టివారు, అరుదుగా పుట్టుచుందురు. ముందుజన్మమున త్రిమూర్తులు త్రిదేవుల సమాన దృష్టితో నిత్యము జీవితాంతము ధ్యానించి నైవేద్యమిచ్చినమ్మినవారు. కలిదేవుని ప్రభావమువల్ల అనేకములుగా మతములు గలిగి ఒక్కొక దేవునే కొలుచునట్లు మతకర్తలు చేసినారు. ఒక్కొక శక్తియే మానవులందు చేరుచున్నది. త్రిశక్తులున్నవారే సుఖపడుచున్నారు. దేహశక్తి శివపార్వతులవల్ల జ్ఞానశక్తి బ్రహ్మ సరస్వతులవల్ల ధనశక్తి పాలనాశక్తి లక్ష్మినారాయణులవల్ల కలుగుచున్నది ముగ్గురిని ధ్యానించమని ఎవ్వరు తెలుపక పోవుటచేత మానవులు పొరబడుచున్నారు. ఈదేహములో త్రిశక్తులు గలవు. త్రిమూర్తులు గలరు పశు పక్షి క్రిమి కీటకములలో కూడ కలరు. వాక్ స్థానమునకు విష్ణు వధిపతి గుద స్థానమునకు ఈశ్వరుడధిపతి ఇట్లే ప్రతి అవయవమునకు ఒక్కొకదేవత నవగ్రహములలో నొక గ్రహము నిలిచి పోషించుచున్నది. మూర్తిత్రయముల నమ్మి ధ్యానించిన, వారిచే సౌఖ్యము. వత్సా త్రిమూర్తుల త్రిదేవుల నమ్మి ధ్యానించి, నీకున్నది నైవేద్యము చేయుము రాబోవు జన్మకు త్రిశక్తులు లభించును.

శ్రీ- స్వామి! కోణాధిపతుల కలయిక విధముగా పాప స్థానాధి

పతులు ముగ్వురు కలిసి యుండిన ఎట్లుండునందురు.

గు— ఏ స్థానమునందురో ఏ స్థానమును చూతురో ఆ స్థాన ఫల ముల నాశనము చేతురు మానవుని జీవితము అయోమయ ముగా మార్చి నరక యాతనలో ముంతురు. దశాను కూల తలో వారుపోక అనాను కూలత యేర్పడిన మృత్యు ప్రద ముగా జీవితము నడచును.

శ్రీ— స్వామి, మేషమునకు 3, 6 బుధుడు 8, 12 శుభ స్థానము లుగా నున్నవి. మరియే యింటివారిని కలుపు కొనవలయు నందురు.

గు— అష్టమము శుభస్థానమయిన మారకస్థానమనబడు సప్తమము ఉన్నదిగద. ద్వాదశము శుభస్థానమయిన దుర్లాభ స్థానమన బడు ఏకాదశ స్థానమున్నది గదా, ఈ ఏకాదశ స్థానమును పూర్వులు పొగడినారు శుభస్థానముగ, ఇదిపాపస్థానము పది యవస్థానము వృత్తిస్థానము పదకొండు ప్రవృత్తిస్థానము పది లాభస్థానము పదకొండు దుర్లాభస్థానము ఈ దుర్లాభమువల్ల మానవుడు మానవత్వమును చెరచుకొని పశు పక్ష్యాదులలో పుట్టుటో రోగియైనిర్ధనికుడై దుఃఖించుటో తప్పదు. దుర్లాభ మనగా వంశ నాశనమైన ఆస్తిలు వచ్చుట, లంచాలు తీసు కొనుట, మోసముతో తీసుకొనుట, దొంగతనముతో తీసు కొనుట రౌడి మామూళ్లు తీసుకొనుట, ఈలాంటివి. దుర్లా భము ఇది తప్పక వంశ నాశనము చేయుట తప్పదు.

శ్రీ— నాకేమయినా ఆస్తిలు వచ్చు యోగము గలదా అని అడుగు చుంటారు. ఇది పాపమేనందుర.

గు— ఇంత ఆస్తిని నాకిచ్చి పోయిరే. వీరికి నేనేమి చేయవలయు నని వారి పేరుతో సత్రమో సావిడో కట్టించి వారిపేరు

వేయుట బావిని త్రవ్వించి వారి పేరు వేయుట స్కూలును కట్టించుట సంవత్సరమున కొకసారి ముప్పురి బ్రాహ్మణులకు వారిపేరు చెప్పి, అమశ్రాద్ధముగా కాయకూరలతో పదార్థము లన్నీ యిచ్చుట తప్పక చేయుచు వచ్చిన పాప పరిహార మగును. లేకున్న పాపము తప్పదు. వేరే నేను చెప్పినవి. చేయనివారు తప్పక పశు పక్షి క్రిమి కీటకాదులందు జనించి జీవితాంతము దుఃఖమనుభవింతురు. వారి విధముగా మరు జన్మకు ఆస్తివకరికియ్యవలసి వుండును. తీసుకొన్నది ఇవ్వ వలసివచ్చును. చేసినది చేయించు కొనవలసివచ్చును.

శ్రీ— స్వామి సప్తమము కళత్రస్థానము మానవునికి ఎన్నో విధ ముల సుఖ ప్రదమైన స్థానమని చెప్పుచు దానినే మారక స్థానమను చున్నారు కారణము.

గు— వత్సా! స్త్రీకి పురుషుడు పురుషునికి స్త్రీ మారకమే యగుదురు చూడుము. స్త్రీ వల్ల పురుషుడు అమిత వీర్య నష్టమువల్ల కృశించును. స్త్రీ సంతతివల్ల దేహబలము నశించును. అందు వల్ల మారకస్థానమన్నారు. ఇదికాక సప్తమస్థానము పాపగ్రహ స్థానము ద్వాదశలగ్నములకు సప్తమము రుద్రస్థానము భార్య వల్ల మగడు మగనివల్ల భార్య నశింపుకాగల స్థానము. సప్తమము. సప్తమాష్టమములలో లగ్న పంచమ నవమ స్థాన అధిపతులు ఒక్కరైనలేనివాడు. సంసారముతో అనేక చిక్కుల పాలయి కడకు ఏకాకి యగుట తప్పదు. సప్త మములో పాప గ్రహమున్న అకాలనిద్ర అకాల ప్రయాణము అకాల వివాహము అకాల భోజనము తప్పదు. సురత సుఖము సున్న. జీవితాంతము దుఃఖింప వలసి వుండును. మానవునికి సప్తమము ముఖ్యాంగము. శుభ గ్రహమున్న

విందులు, వినోదములు, సకాల షడ్రస షోపేత భోజనము సకా వివాహము సకాల ప్రయాణము సకాల నిద్ర తటస్థించును సురత సుఖమునకు లావణ్యవతులు, అనురాగవతులు లభింతురు. ఇది పూర్వ పుణ్య మనబడును.

క— సప్తమ మే సంసారము.
సప్తమ మే సత్కళత్ర సంతోషంబున్
సప్తమ మే మృష్టాన్నము
సప్తమమున్ చెడిన చెడును సర్వ సుఖంబుల్

అని శాస్త్రమున్నది. షట్ స్థానాధిపతి సప్తమములో నుండిన రోగిష్టి కోపిష్టి పాపిష్టిగాను, అష్టమాధిపతి యుండిన చావుకు తెగించినదిగా దుఃఖ పెట్టునదిగా కొంప నాశనము చేయునదిగా విడిపోవునదిగా నుండును. ద్వాదశాధిపతివుండిన దుర్వ్యయము చేయునదిగా పాప భూయిష్టగా చనిపోవునదిగా నుండును. సప్తమాష్టమములో పాపగ్రహములున్న స్త్రీకిగాని పురుషునకు గాని విధవత్వము తప్పదు.

శ్రీ— స్వామి ఒక్కొక్కరికి, నిర్మాణములు చేయు బలముండదు. కాదని ధనబలముండి చేసినను నిలువక పోవుచున్నవి. గ్రహ మెట్లుండును.

గు— వత్సా చతుర్థ దశమములలో 6-8 12 గృహముల వారుండిన, చెట్టు చామ మొదలుకొని సర్వ స్థిరాస్తులన్నియు, పద భ్రష్టమగును. వంశ వృక్షానికి కూడ హానిని కల్పింతురు. సర్వ సంపదలు పరుల పాలగును. కడకు దుఃఖ జీవితము చేయవలసి వచ్చును. సుఖముండదు. చేసిన కార్యములన్ని చెడిపోయి చింతింప చేయును.

శ్రీ— స్వామి ఏమి ఇంత అన్యాయము జరుగుచున్నదే, పాపపుణ్య

విచక్షణ జ్ఞానము ప్రజలలో దిన దిన క్రమేణ నశింపగు చున్నదే కారణమేమందురు.

గు— వత్సా యుగధర్మమిది, కృతయుగమును సుక్షత్రియుడగు సూర్యుడు రాజుగ, శాపానుగ్రహశక్తి గల గురువు మంత్రిగా పాలించినారు. నాలుగు పాదముల ధర్మము నడచి నెలకు మూడు వానలు కురిసి సుభిక్షముగా పంటలు పండి, ప్రజలు ప్రభువులు అన్యోన్యముగా కాలము గడిపినారు ఆనాడు. శని, శుక్ర, బుధ, రాహు గ్రహములు కదల మెదలకుండ వుండి నవి, చక్కగా కాలము నడిచినది.

త్రేతా యుగమునకు బాహుబల పరాక్రమూడైన కుజుడు, రాజుగను రాక్షస గురుడగు, శుక్రుడు మంత్రిగను, పాలించ వలసి వచ్చినది. కుజుడు గురుపాలితుడు యువ కుడు, శుక్రుడు శని పాలితుడు యువతులకు, పాలకుడు. ఒకరిమాట ఒకరికి సరిపోదు. యువతి యువకులకు అధి పతులు, యౌవనకాలాధిపతులు స్త్రీలకు విపత్తులు, తటస్థింప చేసినారు. శుక్రబలమున శాంబరీ విద్యా ప్రభావమున రాక్ష సుల పురికొల్పి యజ్ఞయాగాది క్రతువులకు రూపవతులగు స్త్రీలకు, తపశ్శాలురకు, బ్రాహ్మణులకు విపత్తుల గల్పింప జేసెను—కుజ గ్రహ బలమున, ధనుర్ విద్యా పారంగతులైన రాజ యువకులు కొంతవరకు రక్షించుచుండిరి. ఇందువల్ల నాలుగింట ఒక పాదము ధర్మము తగ్గెను—ద్వాపరయుగమున చంద్రుడు రాజుగను బుధుడు మంత్రిగను నియమితులై పాలింపజొచ్చిరి. చంద్రుడు గురు పాలితుడు, బుధుడు శని పాలితుడు గాన ఒకరికిమాట ఒకరి నచ్చనిదై పోయెను. బుధుడు క్షుద్ర విద్యను రాక్షకులకు దుర్మార్గులకు దుష్టులకు

నిచ్చి సాధు సజ్జనులకు, పతివ్రతలకు రూపవతులకు కన్య లకు అపకారముల చేయువారిని పురికొల్పెను-చంద్రుడు సకల విద్యా పారంగతుడు బలవంతుడు. గాన, రాజుల ధనుర్ విద్యా పారంగతులచేసి దుష్టులను ప్రబలనీయకుండ చేసి పాలన సాగించుచుండెను. ధర్మము నాలుగింటి రెండు భాగములు నశింపయ్యెను. కలియుగమునకు, శని రాజుగను రాహు కేతువులు మంత్రులుగను శని తీసుకొని పాలింప బూనెను. ధర్మమును అధర్మముముగ, సత్యమును అసత్యముగ, సత్కర్మమును, దుష్కర్మగ, న్యాయమును, అన్యాయముగ, ఉన్నది లేనట్లుగా లేనది ఉన్నట్లుగ ఆచారమును అనాచార ముగ అనాచారమును, ఆచారమగు మాతృ పితృ గురుదేవ బ్రాహ్మణ సాదు సజ్జన వృద్ధ ఆశీస్సులకు బదులు దూషణలు తినువారుగ-దైవమును నమ్మి ధ్యానించుటకు బదులు గురువు నేనమ్మి గురువునే ధ్యానించి వాడుగ చేయవలసిన బాద్యత తనకున్నది గాబట్టి, ముందున్నవన్నీ నశింపచేసి, పాలింప బూని, ముందు శాపాను గ్రహాశక్తిగల్గి దివ్యదృష్టితో చూచు బ్రాహ్మణుల అడుగంటించి బ్రాహ్మణాగ్రహారముల పోషించు రాజుల ధ్వంసము చేసినగాని నా రాజ్యపాలన సాగదని ప్రారంభములోనే తలంచి చేసెను.

శ్రీ- వారుండిన కలియుగము ఎందుకు నడవదు. వారికింతశక్తి యున్నందుర.

గు- ఔను దేవాలయములో దేవునికి భక్తులకు మధ్యలో అర్చకు డున్నట్లు బ్రాహ్మణులు అటు దేవతకులకు ఇటు ప్రజలకు మధ్యలో నుందువారు. మంత్రమూలమున మానవులకు కావ లసిన సకల సంపద చేకూర్చుటకు విపత్తుల తొలగించుటకు

సకాలమునకు వర్షముల కురిపించుటకుగాను అనాది నుంచి బ్రాహ్మణుల నియమింపబడియున్నది. మనో వాక్కాయ కర్మల కేంద్రీకరింప చేసుకొని త్రిసంధ్యల సంధ్యావందనాది విధుల మంత్రాను ష్ఠానములచేసి, మంత్రాది దేవతా అనుగ్రహము సంపాదించినవారు సమయానుకూలముగ దైవ శక్తితో ప్రజలను సర్వకార్యములను సమకూర్చి ప్రపంచమునకు మేలుచేయువారు గ్రహారిష్టముల తొలగింప ప్రయత్న పూర్వకముగా పాటుపడెడువారు, వీరియందు దైవశక్తి గలదు, వీరుండిన కలికాలమునకు అడ్డము వత్తురని ఎంచి బ్రాహ్మణ వంశముల నశింపుచేయుటకు బూనెను, అందులో శపానుగ్రహశక్తి గలవారిని దివ్యదృష్టివల్ల భూత భవిష్యత్, వర్తమానకాలము తెలుప తగిన వారిని, సకల విద్యా పారంగతులగువారిని ఏరిఏరి అధోగతి పాలుచేసెను. వీరు పోవుటచేత రాజులు చెరరేగి ప్రజల పీడింప జొచ్చిరి. వర్ణాశ్రమ ధర్మములు మరుగయ్యెను బ్రాహ్మణ రక్షణ దండనవదలుకొనిరి. దండన లేక పోవుటచేత వారుచేయదగు దైవకార్యముల మానుకొని; అన్యకార్యముల చేయబూనిరి. దైవశక్తి పలాయనమయ్యెను, సుభిక్షము, దుర్భిక్షమయ్యెను. సుజనుల దుర్జనులైరి. ఒకేజాతిగా అన్యోన్యులైయున్న బ్రాహ్మణుల నానా కులములుగా, నానా మతములుగా చీల్చి, వైషమ్యము గల్పించెను. ఒకరిమాట ఒకరికి కానివ్వకుండచేసెను. ఒకరిమాట ఒకరికి తెలియకుండ నానా భాషల సృష్టింపజేసెను. జ్యోతిశ్శాస్త్రజ్ఞుల రూపునామక్రియలు లేకుండజేసి జ్యోతిశ్శాస్త్రము మరుగుపరచి కృత్రిమజ్యోతి శ్శాస్త్రముల సృష్టింపజేసి, ఇది నా మతము ఇది నామతమని

నానారీతుల గల్పించు వారిని, పుట్టించెను. సర్వ విషయముల తెలుపుచు దొంగతనముల దోపిడీల తెలుప గలుగు అంజనము మరుగు పరచెను. సర్వరోగముల సూక్ష్మముగా పోగొట్ట గల ఓషధీ ప్రభావముల (మూలికల) మరుగుపరచి ఆసురీ మానుషిదైవీ చికిత్సలను మూడింటిలో ఆసురీ చికిత్సకు ప్రాధాన్యత గల్పించెను. దైవీ చికిత్సను అడుగంటించెను. రోగవిదాన పూర్వార్థముల గ్రహించి పలాని గ్రహమువల్ల పలాన చోట పలాని విధముగ జబ్బు ఉత్పత్తియై యున్నదనియు పలానాచోట కాగలదని చెప్పగలుగు జ్యోస్యమును పూర్తి నశింపుచేసెను. ఎట్టి రోగముసైనను, మంత్రానుష్ఠానమువల్ల పోగొట్ట గల సద్ బ్రాహ్మణుల మట్టుపెట్టెను.— అరిషడ్ వర్గముల సప్త వ్యసనముల అభివృద్ధిచేసి, రోగములనంతముగ గల్పించెను. పాపభీతిలేని మానవుల సృష్టించెను. మాతృ పితృ గురుదేవ బ్రాహ్మణ సాధు సజ్జన వయోవృద్ధుల ఆశీస్సు లందుకొను వారిని మరుగుపరచి దూషణల తిను పుత్ర పుత్రికల సృష్టియగునట్లు జేసెను—బ్రాహ్మణ అగ్రహారములలో బ్రాహ్మణులు గంటల కొలది మంత్రాను ష్ఠానముల మనోవాక్కాయ కర్మల కేంద్రీకరింప జేసి, ధ్యానించి కడన, దేశరక్షణ ప్రజారక్షణ కొరకై, ఇట్లు చెప్పి నీళ్లు విడుచుచుండేవారు. ప్రభువులు ధర్మాత్ములై ప్రజల పాలింతురు గాత, ప్రజలు కుల మత ద్వేషులై పోట్లాడక అన్యోన్యులై యుందురు గాత, ప్రభువులు ప్రజలు భావవిభేదము జెందక ధర్మదూరులు గాక ఏకగర్భ జనితులుగా నుందురు గాత. సకాల వర్షములు కురిసి సంతృప్తిగా ధాన్యము పండి ప్రజలు సంతృప్తి జెందుదురు గాత, ప్రజలు దుష్ట గ్రహ బాధల నుండి తప్పి, శత్రు రోగఋణ విపత్తులకు లోనుగాక సుఖులైయుందురు గాత, యని నీళ్లు విడిచేవారు వీరిని, నశింపు చేసెను. వీరి మాన్యముల పాడు చేయించెను. వీరు

కడు పాత్రమునకై దానములు యెట్టిపైనా తీసుకొనుట అధర్మముగా ప్రవర్తించుట అన్యాయములు చేయుట ఎట్టి నీచోద్యోగముల కైనా దిగుట. నీచకార్యములు చేయుట, చేయుచుండిరి, దైవధ్యానము ప్రపంచముకై చేయువారు లేరయిరి. దేవస్థానములలో ప్రపంచమునకై సంకల్పముచెప్పి పూజించు అర్చకులు లేరైరి. ఇది అంతా, కలిదేవుని మహిమ ఇంకా వున్నది. వర్షములు, కొన్ని చోట్ల అతి వృష్టిగా కొన్నిచోట్ల అనావృష్టిగా, కురసి, పంటలు పండక, నదీనదములు, ఎండి తటాకములలో చుక్కనీళ్ళు లేక బీటలు పారి భూమి పత్తెలుచీలి చెల్లు చామలు ఎండి, స్థావర జంగమములు అల్లాడు కాలమును సృష్టించును. దైవముఅగ్గి పెట్టెలో అగ్గిపుల్లలవలె వూరకుండును, గీకిన అగ్గిపుల్ల మండును. సంకల్పయుతముగా దైవమునకు, చెప్పుకొనిన సర్వ కార్యముల నెరవేర్చును. నవగ్రహ బాధల నివారించును. చెప్పువారెవరు. వత్సా ఇంకా అనేక బాధల దుర్మార్గులవల్ల ప్రజలు అనుభవించ వలసియున్నది. వర్ణాశ్రమ ధర్మముల అడుగంటింపచేయును, నాస్తికుల పుట్టించి దేవుడులేడని వరుస వావిలేదని పెద్ద చిన్నలులేరని, ఆచార వ్యవహారములు కల్లలని బోధింప చేయును, దైవశక్తి వల్లనే ధనికులుగ, విద్యాధికులుగా బాహు బలవంతులుగ భూస్వాములుగ అరోగ్యవంతులుగ సర్వసౌఖ్యవంతులుగ ప్రభుత్వోద్యోగులుగ నున్నవారని గ్రహించువారులేరు. ఇది ఎట్లో వచ్చినది అని భావించు వారిని పుట్టించెను, ఇట్టివి, ప్రబలి మానవులు చెడుకాలమును సృజించు వంతు శనికి వున్నది, గాన సత్కర్మల నశింపుచేసి దుష్కర్మల వృద్ధి చేసెను–ఇక రాహు కేతువులన్ననో, కేతుదశ పోయిన రాహువు మహాభయంకరుడు చోరుల దుష్టుల దుర్మార్గుల పాప భీతిలేని ప్రజల పుట్టించి దారి దోపిడీల చేయించును. దొంగ బుద్ధి

పుట్టించును-తసజాతి వారిచే కావలసినన్ని విపత్తుల ప్రజలకు గల్పించి అలజడి సృష్టించును-రాహు దశపోయిన కేతువు మోక్ష గామి మోక్షమునకు దారిచూపు తత్వజ్ఞానమును నేర్పును. సజ్జనత్వ మును భోధించును. పుట్టని చావని ఊర్ధ్వ లోకమున నుండు మార్గము నుచూపును. వత్సా ఈ కలికాలములో జరుగు అన్యాయ ముల జరుగబోవు ఘోరముల కాల వైపరీత్యములచెప్పబూనిన అనేక మున్నవి గ్రంథ విస్తారమగును. చదువు వారికి విసుగు పుట్టిం చును. ఇంతటితో చాలింతును.

శ్రీ— స్వామి, కేతువు మంచివానిగ వర్ణించితిరి జోస్యులు పాపు నిగ చెప్పినారు. కేతువుకు దర్భసమిదయని చెప్పిరి, దర్భను శుభా శుభ కార్యములందు పవిత్రముగ వాడుచున్నారు. పవిత్రము లేక ఏ కార్యము చేయరు కారణమేమందురు.

గు— వత్సా, జోస్యము వంశ పరంపరగా వచ్చినది. వారి పౌరో హితులకు ముక్క చెప్పలేదు, జోస్యులకు పౌరోహితులకు జోస్యమువల్ల బద్ధద్వేషమేర్పడి పాండిత్య బలమువల్ల కృత్రిమ జోస్యము తయారుచేసినారు, వానిలో ఊహా నా శక్తితో గురువు, శుక్రుడు, శుద్ధ బుధుడు, పూర్ణ చంద్రుడు, శుభులని, రవి, కుజ, శని, రాహు కేతు గ్రహములు పాపు లని, నియమించు కొనుటలో కేతువును పాప గ్రహ మన్నారు. గ్రహములకు పాపత్వము శుభతత్వము ఎట్లు వచ్చినది వారు గమనించలేదు. స్థానాధిపత్యము వల్ల పాపత్వము గ్రహమునకు వచ్చినది గాని, శుద్ధ పాపులుగా నవగ్రహములలో యెవరులేరని తెలియదు. గ్రహములు త్రిమూర్తుల అంశలతో వున్నవనియు లగ్నములు నక్షత్ర ములు ముగ్గురి అంశలతో వున్నవనియు పిపీలిక మొదలు

కొని మానవ పర్యంతము త్రివిధశక్తులతో జీవించుచున్న వనియు [ జ్ఞానశక్తి దేహ,శక్తి, ధనశక్తి ] తెలియదు, జ్ఞానశక్తికి బ్రహ్మ సరస్వతి, దేహశక్తికి, ఉమా మహేశ్వరులు ధనశక్తికి లక్ష్మీ నారాయణులు ఈ ముప్వురి బలముతో జీవులు జీవించు చున్నవని, ఎవరిని గొలిచిన వారి శక్తియే గలుగునని తెలియక ఒకరొకరినే గొలిచి ఒక శక్తినే అనుభవించుచున్నారు, అనగా ఉమా మహేశ్వరుల నమ్మి ధ్యానించిన వారికి దేహశక్తి, గలుగును జ్ఞానశక్తి ధనశక్తి; లభించక బాధ నొందుచున్నారు. లక్ష్మీ నారాయణుల గొలిచి ధనమునే బడయుచున్నారు, దేహశక్తి, జ్ఞానశక్తి లభించక చింత చేయుచున్నారు. బ్రాహ్మిబ్రాహ్మల గొలిచి జ్ఞానశక్తిని బడసి దేహశక్తి ధనశక్తి లేక కడగండ్లు బడయుచున్నారు, త్రిశక్తులు మూడు లభించవలయునన్న ముప్వురిని సమ దృష్టితో చూచి ముప్వురుని ద్యానించిన త్రిశక్తులు జీవితాంతము గలిగి సుఖింపగలుగును. మతకర్తల ననుసరించిన త్రిశక్తులు లభింపవు. కలిదేవుని ప్రభావమున మతకర్తలు గ్రామమున కొక ఆశ్రమము క్షుద్ర విద్యలవల్ల తయారయిన యోగులు మాయావులు, కలిగి, త్రిమూర్తుల కొలిచెడి వారరుదైరి మత కర్తల మాయా ఋషి పుంగవుల కొలుచు ప్రజలైరి, ఇది కలి మహిమ.,

శ్రీ— స్వామి, ఆశ్లేష నక్షత్రములో జననమైన అత్తకుహాని, మూల మామకు, విశాఖ మరుదులకు హాని అన్నారు నిజమ

గు— వత్సా, అన్ని కృత్రిమముగా వ్రాసినవేగాని శాస్త్ర సమ్మతముగా కాదు. అమ్మాయికిగాని, అబ్బాయికిగాని శని సప్తమములో పాపియై యుండిన అక్కడగాని యిక్కడగాని

ముండమోపి యజమానియై యుండును లేక భార్య చని పోయిన వారుండినను, వేరొకరు ముండమోసిన వారుండినను, భయములేదు. లేకుండిన, మామకు వంతు వున్నట్లే అత్త విధవ యగుట తప్పదు.

పాపియైన బుధుడు సప్తమములో నుండిన అత్త లేక మామ పాలనలో గృహముండును. అత్త వుండదు. జాతకునకు కుజుడు పాపియై కుజ క్షేత్రములు పాపత్వము చెంది యుండిన, సోదరులుండి వారివల్ల బాధ గలుగుటగాని, సోదర్లు లేక, దుర్బలుడై యుండుటగాని సంభవించును విశాఖ నక్షత్రము ఏమి చేయజాలదు.

శ్రీ— స్వామి కొందరు వడ్డీ వ్యాపారముతో లక్షలు సంపాదిస్తారు కొందరు దానితోనే పతనమవుతారు, ఏ గ్రహముల వల్లనంటారు.

గు— లగ్న షట్ స్థానమున నవమాధి పతియుండిన వడ్డీ వ్యాపారముతో దండిగా సంపాదించును. షట్స్థానాధిపతిగాని, అష్టమాధిపతిగాని ద్వాదశ తృతీయాధిపతులుగాని వుండిన అప్పుయిచ్చినది రాక నష్టపడును. ఆరింట శుభులుండిన శత్రు రోగ ఋణ విపత్తులుండవు. పాపులుండిన యిచ్చినది రాదు. తెచ్చినది తీరదు యిప్పించినది బొత్తిగ రాదు.

శ్రీ- వృత్తి, ఉద్యోగ, వ్యాపార, జీవనములు ప్రవృత్తి జీవనములు అనగా గ్రహము లెట్లుండును.

గు— చతుర్థ దశమములు వృత్తి ఏకాదశమము, ప్రవృత్తి, ఏకాదశమమున లగ్న పంచమ నవమాధిపతు లుండిన దురాదాయము వచ్చును. పాపులుండిన పోవును. స్త్రీ గ్రహములుండిన స్త్రీలవల్ల పురుష గ్రహము లుండిన పురుషులవల్ల వచ్చుట పోవుట వుండును.

శ్రీ— స్వామి, శ్వేతకుష్ఠ (తెల్లబొల్లి) వచ్చుట ఏ గ్రహము వల్ల.

గు— చర్మవ్యాధులకు కుజుడధిపతి తెలుపునకు చంద్రుడధిపతి వీరిద్దరు పాపులై కుజ చంద్ర క్షేత్రములు పాపత్వము చెంది కటకమునగాని మేషమునగాని ఒకే నక్షత్రమున నుండిన శ్వేత కుష్ఠు వచ్చును.

శ్రీ— కొందరికి గండమలలు వస్తాయి ఏ గ్రహములవల్ల.

గు— కంఠమునకు చంద్రుడుధిపతి గడ్డలకు కురుపులకు చర్మ వ్యాధులకు కుజుడధిపతి ఇరువురు పాపులైగాని పాప గ్రహములు కుజ క్షేత్రము లందుండిన, గడ్డము క్రింద ఒక చెవుకు క్రింది నుంచి మరొక చెవు వరకు గడ్డలు కట్టి పగిలి చీము రక్తము కారుతు బాధించునవి గండమలలు.

శ్రీ— క్షయ రోగము వస్తుంది (టి. బి) ఏ గ్రహమువల్ల

గు— వీర్యోత్పత్తికి అధిపతి చంద్రుడు గాన పూర్వ జన్మ పాపము వల్ల వీర్యోత్పత్తి చేయు గ్రంధులు. అమిత వేడిమివల్ల ఉత్పత్తి మానుకొనును సప్తధాతువులకు బలము నిచ్చునది వీర్యము ఉత్పత్తి మాని నందువల్ల ఆహారము తగ్గి సప్త ధాతువులు శోషించినది క్షయ దీనికి చంద్రుడు, చంద్ర క్షేత్రము పాపత్వము చెందుటయే క్షయ.

శ్రీ— కటితటవాయువు (పోలియో) వచ్చు పిల్లలకు గ్రహములు లెట్లుండును.

గు— కుజుడు కుజ క్షేత్రములు రెండు పాపత్వము చెందిన కాళ్లు పడిపోవుట నలుపులు వచ్చుట కురుపులు లేచుట చర్మ వ్యాధులు వచ్చుట క్రిందపడి చేతులు కాళ్ళు యిరుగుట నెత్తిన కురుపులు లేచుట మొదలగునవి వచ్చును, కడుపులో వున్నపుడే అట్టి కుజదశగాని కుజుని గృహములలో నున్న

శని, శుక్ర బుధ గ్రహములవల్లకాని వచ్చును. భూమిపైన పడిన తరువాత అట్టి దశల భుక్తులలో వచ్చును, మూత్రాధిక్యత మూత్రములో సుద్దపడుట మట్టుకట్టుట బంకగా నుండుట వాసనగా నుండుట కూడా వుండును. తల్లిదండ్రి జాతకములలో కూడా ఈ జబ్బులుండును.

శ్రీ— నవగ్రహ ప్రతిష్ట అపసవ్యమై అ ప్రతిష్టమయినదని అన్నారే యట్లు

గు— తూర్పునకధిపతి యగు సూర్యుని మధ్యలో నుంచి, అగ్నిమూలలో నుండవలసిన శుక్రుని తూర్పునకువేసి, వాయువ్యమూలకధిపతి యగు చంద్రని అగ్నిమూలకువేసి, ఈ శాన్యమున నుండవలసిన కేతుష్ఠను వాయువ్య మూలకు వేసి ఉత్తర దిశకధిపతియగు బుధుని ఈ శాన్యమునకు వేసి, ఈశాన్యమునకు అధిపతియగు గురువును ఉత్తరమున వేసినారు అందువల్ల నవగ్రహ ప్రతిష్ట అ ప్రతిష్టయైనది, చూపు లోపలికి పెట్టక ఎలిగాకి పెట్టి చెరచినారు.

శ్రీ- స్వామి, జ్యోతిశ్శాస్త్రము పరాశరునివల్ల పుట్టినదియా షట్ శాస్త్రములలో నొక్కటియా, వేదముల కన్నాముందా లేక వేదముల తరువాత పుట్టినదా తెలుపుడు.

గు— శ్రీ వత్సా, ప్రపంచము పుట్టుకలోనే అష్ట దిక్పతులు నవగ్రహములు పుట్టినవి, వీరివల్ల పంచ తత్వములు పుట్టోందినవి పంచతత్వమువల్ల, స్థావర జంగములు సృష్టి అయినవి. నవగ్రహకారకత్వములే సృష్టికి మూలములు. (ఉదాహరణ) చంద్రునికి నీరు, సముద్రములు గాలి, గగనము,-కుజునకు భూమి స్థావరములు కొండలు మొదలగునవి ఇట్లే నవగ్రహములకు కారకత్వములు గలవు. వీరికి తెలియక ఏ కార్యము

[పోలీసులవలె] సర్వ జీవరక్షణ భక్షణకు కారకులు ప్రజలు చేయు పాప పుణ్యములు గ్రహించి, అందిచ్చుచున్నారు- సృష్టికి మూలము దైవము దైవ నిర్మితములు అష్ట దిక్పతులు నవగ్రహములుగాను జ్యోతిశ్శాస్త్రము సృష్ట్యాది నుండి ఉన్న దని జ్యోతియే చెప్పుచున్నది కలియుగములో పాపము పెరుగ పలసియున్నది. శనిరాజు రాహు కేతువులు మంత్రులు వీరివల్ల ప్రజలు ధర్మ రహితులై పోవలసి యున్నది. గాబట్టి ఈ శాస్త్రమేగాక అంజన ఓషధీ ప్రభావము, మంత్రాంగము బ్రాహ్మణులు నశింపు అయినగాని కలియుగము నడువదని కలిదేవుడు నశింపుచేసినాడు. ఇవి అన్నీ ప్రపంచము పుట్టి నప్పుడే పుట్టినవని జోస్యము చెప్పుచున్నది. వేదాంగములు షట్ శాస్త్రములని చెప్పుచున్నారు. వేదములు ప్రపంచము పుట్టిన తదుపరి పుట్టిన వనియే తెలుపుచున్నవి జోస్యము, యజుర్వేదమునకు గురువు ఋగ్వేదమునకు శని, సామ వేద మునకు చంద్రుడు అధిపతులుగా నున్నారు. అధర్వణ వేదము మళ్ళి పుట్టినది, దీనికి కుజుడధిపతి. ధనుర్ విద్య మంత్రములు గలది గాన, కుజునకు యిచ్చినారు. వేదములు మూడనియే చెప్పవలయును, జోస్యము, వైద్యము షట్ శాస్త్రములలో కలిపినారు.

శ్రీ- స్వామి నవరత్నములు అన్నీవక ఉంగరములో పొదిగించి వేసుకొనిన చాలా మంచిది. కష్టములు తీరగలవు. చాలా ఉన్నత స్థితి నందుకొనగలవని చెప్పి వేయించుచున్నారే ఇది నిజమేనందుర.

గు- వత్సా లగ్న విభజన గ్రహ విభజన తెలియక పలికినపలుకు గాని, శాస్త్రము గాదు, గురు పాలితులకు పుష్య రాగము

పగడము, ముత్యము, వైడూర్యము, మాణిక్యము, ఇది దొరకదు గాన ఎఱుపురంగు రాయిని చేర్చుకొనవచ్చును. అప్పటికి గురు పాలిత ఉంగరమగును. నీలము, ఆకుపచ్చ, తెలుపు, ఆకుపచ్చ, తెలుపు మిశ్రమముగా నున్నది. (గోమేధికము) ఇవి శని పాలితములు శని పాలితులకు పనికి వచ్చును. ఇట్లుగాక అన్ని కలిపివేసుకొనిన విపత్తులు తప్పవు. తనకుగాని, భార్యకు సంతతికిగాని చిక్కులు తప్పవు గురువు : పుష్యరాగము రవి ; మాణిక్యము కుజుడు : పగడము చంద్రుడు మంచిముత్యము కేతువు వైడూర్యము ఇవి గురు పాలితములు.

శని; నీలము; శుక్ర; వజ్రము, బుధ; పచ్చ, రాహువు: గోమేధికము-ఇవి శని పాలితములు. ధనుర్ మీనలగ్న జాతకులకు పుష్యరాగము-మేష, వృశ్చిక జాతకులకు ఎఱుపు రంగు గాని పగడముగాని శ్రేయము సింహ లగ్న జాతకులకు మాణిక్యము లభించదు గాన, పుష్యరాగము మంచిది. కటకి లగ్న జాతకులకు మంచిముత్యము శ్రేయోదాయకము-కేతువుకు వైడూర్యము.

మకర కుంభ జాతకులకు నీలము; వృషభ, తుల, జాతకులకు వజ్రము; మిధున.కన్య జాతకులకు ఆకుపచ్చ శ్రేయస్సు నిచ్చును. వేసుకొనుట మంచిది. రాహువుకు గోమేధికము.

శ్రీ- స్వామి, నవగ్రహములవల్ల బాధలు గలిగినప్పుడు ఏ గ్రహమువల్ల బాధ గలుగుచున్నదో ఆ గ్రహ ప్రీతికరముగా తీసివేయుట శ్రేయమే నందుర.

గు- ఔను! తీసివేయుట మంచిదేగాని, తెలుసుకొని తీసివేయుట శ్రేయము. సూర్యుడు పాపియై లగ్నద్వితీయ షష్ఠ అష్టమ. సప్తమములందున్న, మూడు జిల్లేడు ఆకుల యిస్తరలో గోదుమన్నము పిడికెడు పెట్టి పసుపు కుంకుమ ఆ ముద్దపైవేసి

(పాలు చక్కెర నెయ్యి వేయవచ్చును.) ఆ యిస్తర చుట్టు, మూడుసార్లు తిరిగి దండము పెట్టుమని, మూడుసార్లు, దిగదీసి, తూర్పు భాగమున పెట్టి వచ్చిన సూర్యగ్రహ పీడ పోవును.

చంద్ర గ్రహమునకు మోతకాకులలో అన్నము పాలు చక్కెర నెయి వేసి కలిపి ముద్దచేసి, పసుపు కుంకుమ వేసి ఆకుచుట్టు మూడు చుట్లు తిరిగి దండము పెట్టుమని ఆకు యెత్తుకొని రోగికి మూడుసార్లు దిగదీసి, వాయువ్య మూలన, నీళ్లు వుండిన నీళ్ళలో వేసేది, లేదా, చెట్టు క్రింద పెట్టి వచ్చేది : కుజుడు పాపియై యుండిన సమిధ సండ్రకట్టె ఆకులుండవు గాన, రావి ఆకులో అన్నము బెల్లము నెయ్యి కలిపి ముద్దచేసి, దానిపై పసుపు కుంకుమ వేసి, మూడు ప్రదక్షణలు చేయించి దండము పెట్టుమని దక్షిణపు దిక్కున పెట్టి వచ్చేది.

బుధుడు-పాపియైయుండిన, సమిధ అపామార్గము (ఉత్తరేణి) గాన ఆకులుండవు. జువ్వి ఆకులో పెట్టి అన్నములో పాలు వేసి కలిపి ముద్దచేసి ముద్దపై పసుపు కుంకుమ వేసి, మూడు ప్రదక్షణలు చేయించి దండము పెట్టుమని ఉత్తరపు దిశన పెట్టి వచ్చేది.

గురువు పాపియైన సమిధ రాగి పుల్లలు, గాన రాగి ఆకులో పెరుగు అన్నము కలిపిన ముద్దపెట్టి పసుపు కుంకుమ వేసి, మూడు ప్రదక్షణలు చేయుమని దండము పెట్టుమని, ఈశాన్య మూలలో పెట్టి వచ్చేది-

శుక్రుడు పాపియైన సమిధ మేడిగాన మేడి ఆకుల యిస్తరలో అన్నము, నెయ్యి, వేసి కలిపి ముద్దచేసి పెట్టి మూడు

చుట్లు తిరగమని దండము పెట్టమని అగ్నిమూల పెట్టి వచ్చేది.

శని, పాపియైయుండిన సమిధ జమ్మిగాన, ఆకులు పనికిరావు మట్టి ఆకులో అన్నము మినపపిండి నూగుపిండి వేసి కలిపి ముద్దచేసి పసుపు కుంకుమ వేసి మూడు ప్రదక్షణలు తిరిగి దండము పెట్టుకొని మూడుసార్లు దిగదీసి పడమటి దిశన పెట్టివచ్చేది.

రాహూవు పాపియైన సమిధ గరికగాన, మట్టిఆకులో అన్నము మినపపిండి వేసి పిసికి ముద్దచేసి, పెట్టి, పసుపు కుంకుమ వేసి మూడు ప్రదక్షణలు తిరిగి దండము పెట్టమని మూడుమార్లు దిగదీసి నైరూతి మూలన పెట్టి వచ్చేది.

కేతువు పాపియైన సమిధ దర్భగాన రాగి ఆకులో ఉలవపిండివేసి పిసికిన అన్నపుముద్దను పెట్టి పసుపు కుంకుమ వేసి రెండు దర్భలువేసి మూడు ప్రదక్షణలు తిరుగమని మూడుసార్లు దిగదీసి, ఈశాన్య మూల పెట్టి వచ్చేది.–

శ్రీ— స్వామి గ్రహరూపి జనార్దన అన్నారు. నవగ్రహములన్ని విష్ణువు రూపములేనందుర, లేక శివ స్వరూపములు బ్రహ్మ స్వరూపములు వున్నావా?

గు— శ్రీ వత్సా! త్రిమూర్త్యాత్మక మీ ప్రపంచము ముగ్గురికి అధికారమున్నదని, పౌరాణిక జోస్యులు గమనించలేదు. అందువల్లనే శాస్త్రము దెబ్బ తిన్నది. గమనింపుము. మేషాది క్రమేణ, ద్వాదశరాసులు అశ్విన్యాది క్రమేణ, నక్షత్రములు, కృత్తకాది క్రమేణ, దశలు ఉన్నవి గదా, వీటిలో కూడ ముగ్గురికి భాగములున్నవి, జనార్దనుని అంశమున గురు కుజ, రవి, కేతు గ్రహములు నాలుగు, శివాంశమున, శని, శుక్ర, బుధ, రాహు గ్రహములు, బ్రహ్మ అంశమున

చంద్రుడు జననమై, పిపీలికాది బ్రహ్మ పర్యంతము, పాలించుచున్నారు. విష్ణు అంశ గ్రహములగు గురు, కుజ, రవి, కేతు గ్రహముల, వీరి గృహములగు మీన, మేష, సింహ వృశ్చిక దనుస్సులను బ్రహ్మ పాలిత కటకమును అనగా ఆరు గృహముల, గురు పాలిత మనియు (గురు బలమని) పిలవబడును_మకర కుంభములు వృషభ మిధునములు_ కన్య తులలు శని పాలితమనియు, శని బలమనియు, పిలువ బడును, లోకులు ఈ సంవత్సరము నాకు గురు బలమెట్లున్నది శని బల మెట్లున్నదని అడుగుచుందురు, లగ్నములు గ్రహములు మూడు భాగములైయున్నవి. ఈ విషయము శాస్త్రజ్ఞులు గమనించలేదు.

శ్రీ— స్వామి నక్షత్రములలో కొన్ని మంచివి, కొన్ని చెడ్డవిగా ఏర్పరచినారు. నిశ్చయమే నందుర.

గు— వత్సా, ఇరవైయేడు నక్షత్రములలో అశ్వనీ, కృత్తిక, మృగశిర, పునర్వసు మఖ, ఉత్తర, చిత్త విశాఖ, మూల ఉత్తరాషాడ ధనిష్ట-పూర్వాభాద్ర ఈ పండ్రెండు గురు పాలితములు భరణి అరుద్ర, పుష్యమి, ఆశ్లేష, పుబ్బ, స్వాతి, అనూరాధ, జ్యేష్ట పూర్వాషాడ, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి ఈ పండ్రెండు శని పాలితములు_రోహిణి, హస్త, శ్రవణం ఈ మూడు బ్రహ్మ పాలితము వెరసి 27 నక్షత్రములైనవి. ఇందులో నవ గ్రహములు ఒక్కొకరికి మూడు వంతున పంచుకున్నారు. పంచుకొనడంలో కృత్తికాది క్రమేణ దశలు వచ్చినవి. సూర్యుని మొదలుకొని నవగ్రహములైనవి, గాన, సూర్యునకు కృత్తిక, ఉత్తర ఉత్తరాషాడ వచ్చినవి. చంద్రునకు రోహిణి హస్త శ్రవణం వచ్చినవి, కుజునకు, మృగశిర, చిత్త, ధనిష్ట

వచ్చినవి, రాహువుకు, ఆరుద్ర, స్వాతి, శతభిషం, వచ్చినవి గురువుకు పునర్వసు విశాఖ పూర్వాభాద్ర, వచ్చినవి, శనికి, పుష్యమి, అనూరాధ, ఉత్తరాభాద్ర వచ్చినవి, బుధునికి, ఆశ్లేష, జ్యేష్ట, రేవతి వచ్చినవి. కేతువుకు, మఖ, మూల, అశ్విని వచ్చినవి. శుక్రునకు, భరణి, పుబ్బ, పూర్వాషాఢ వచ్చినవి.

శ్రీ— ఈ నక్షత్రములలో కొన్ని దుష్ట నక్షత్రములని విభజించి నారే నిజమేనందుర.

గు— వత్సా, గ్రహములలో రవి, కుజ, శని రాహు కేతువుల క్రూరులుగా భావించి శుద్ధ పాపులన్నారు, వారి నక్షత్ర ముల దుష్ట నక్షత్రములన్నారు. ఇదిగాక నక్షత్రములకు, అధిపతుల నేర్పరచినారు, అశ్వనికి అశ్వనీ దేవతలని, భరణికి యముడు కృత్తికకు అగ్నిదేవుడని వ్రాయుటచేత భరణి కృత్తికలలో ఏ శుభ కార్యము చేయరు. దీనిలో కర్తరి, అనియు పేరుపెట్టి అన్ని శుభ కార్యములకు ఆటంకము గల్పించినారు. కృత్తికను చాలా భయంకర నక్షత్రముగా సృష్టించినారు కడకు, క్రొత్తగా పొయ్యి వేసుకొనుటకు మంచిదన్నారు, గురు పాలితములని శని పాలితములని, గమనించినవారుగారు, ప్రతి వస్తువు ప్రతి జీవి, స్థావర, జంగమములు గురు శని పాలితములుగా జన్మించినవి. మానవులు ముందు జన్మములో ఈశ్వరు నారాధించి మాన వత్వమును సంపాదించుకున్నవారు. శని పాలిత లగ్నము లందు జనన మగుదురు. వారికి శని బుధ శుక్ర రాహు గ్రహ పాలన గలుగును. విష్ణువునారాధించి మానవత్వము సంపాదించు కున్నవారు, గురు పాలిత లగ్నములందు

జనింతురు. వీరికి గురు కుజ రవి, చంద్ర కేతు గ్రహపాలన గలుగును, అందువల్ల గురు పాలితమని శని పాలితమని యేర్పడినవి, ఇట్లే ద్వాదశ లగ్నములలో ఇరువదేడు నక్షత్రములలో నవగ్రహములలో రెండు భాగములైనవి, హరి హర రూపములైనవి వీరివల్ల చావు పుట్టుకలు జీవులకు గలిగినవి.

శ్రీ— స్వామి రాహు కేతువులకు గృహములు లేవుగద వీరిని చాయా గ్రహములని కొందరు ఏడు గ్రహములతోనే శాస్త్రములు వ్రాసినారు. వీరుయే పాలిత గ్రహములుగా గమనించ వలయు నందురు.

గు— వత్సా, కేతువుకు, కుజుడు, అశ్వనీ నక్షత్రమును, సూర్యుడు మఖ, నక్షత్రమును గురువు, మూల నక్షత్రము నిచ్చి గురు పాలితులతో చేర్చుకున్నారు–బుధుడు, ఆరుద్ర, శుక్రుడు, స్వాతి, శని, శతభిష నక్షత్రములనిచ్చి శని పాలితులందు చేర్చుకొన్నారు. అందువల్ల రాహువు, శని వర్గమునందు, కేతువు గురు వర్గమునందు చేరుకున్నారు–రాహు దశపోయిన కేతువు–కేతు దశ పోయిన రాహువు బలవంతులు. రెండు దశలు మిగిలిన, అర్ధబలమే వుండును.–

శ్రీ— స్వామి, గ్రహాను కూలత అనానుకూలత అంటున్నారే ఎట్లు

గు— వత్సా, బాల్య మాదిగా పాపగ్రహ దశలు పోయి, శుభ గ్రహదశలు మిగిలిన, మానవులకు శుభము దీనిని దశానుకూలతలందురు. బాల్యము నుండి శుభ గ్రహదశలు పోయి, పాప గ్రహదశలు మిగిలిన మానవులు వృద్ధాప్యమున కష్ట పడుదురు. దీనిని అనానుకూలతని చెప్పుదురు. ఇది ముఖ్యముగా చూడ తగినది,

శ్రీ— ఏ నక్షత్రమున జననమయిన దశానుకూలత వచ్చును. ఏ

నక్షత్రములో జననమైన అనాను కూలత యేర్పడును,

గు— గురు పాలిత లగ్నములకు పునర్వసు, విశాఖ పూర్వాభాద్ర నక్షత్రములలో నాల్గవ పాదములలో కొంచెము మిగిలి వుండగా జననమైన దశానుకూలత గలుగును. శని, బుధ, కేతు, శుక్ర దశలు బాల్యమున పోయి లగ్న, పంచమ, నవ మాధిపతులు దశల మిగులును వృద్ధాప్య దశలో మానవుడు సుఖపడును-శని పాలితులకు భరణి, పుబ్బ, పూర్వాషాడ శుక్ర దశలలో నాల్గవ పాదమున కొంచెము మిగిలిన శేషము పోగా రవిదశ చంద్ర కుజ రాహు గురుదశలు పోయిన లగ్న పంచమ, నవమ స్థానముల వారి దశలు వచ్చును. మానవుడు సుఖపడును. శాస్త్రజ్ఞులు వ్రాసిన గురు, శుక్ర, బుధ, చంద్ర దశలు, శుభస్కారములు గావు. లగ్న విభజన లేక చేయక తెలియని యోగములుగా తెలియుచున్నది. ఈ దశాను కూలతకుతోడు గ్రహాను కూలత గలిగిన వారే గొప్ప గొప్ప నాయకులు చూడుము.

| | | | |
|---|---|---|---|
| కు | శు బు | శ ర | |
| | విశాఖ 2 | | |
| | | | |
| ల గు | | చ | |

లగ్నాధిపతి లగ్నమునుండుట గొప్పయోగము. పంచమాధిపతి,

చతుర్థమున నుండుటవలన స్థిర చరాస్తులు రెండు ఉన్నతస్థితి నందు కొనెను. నవమాధిపతి, షట్ స్థానమున నుండుట ఇది వక గొప్పయోగము 6, 11 స్థానములు శుక్రునిపై నుండుటవలన ఆరింట నుండినను లాభ స్థానమున నుండినట్లే అయినది, విశాఖ నక్షత్రము దశానుకూలత నక్షత్రము గురుదశ ప్రారంభమై శని, బుధ, శుక్ర గ్రహదశలు పోవును. శుక్రుని, గురువు చూడబము శుక్రుని గృహములగు తులను తులలోనున్న చంద్రుని కుజుడు చూడడము. నవమాధిపతి వృషభమున నుండుటయు గలదు శుక్రుడు శుక్ర క్షేత్రములు రెండు లగ్న పంచమ నవమాధి పతులు చూచుటవలన, శుక్రుని పాపత్వము సర్వము నశిం పైనది-పంచమాధిపతి చతుర్థము నుండి, బుధ క్షేత్రములగు మిధున కన్యల చూచుటయు లగ్నాధిపతి పంచములోనున్న బుధ శుక్రుల చూచుటవలన బుధుని పాపత్వము సర్వము నశింపైనది, గురువు గురు క్షేత్రములు కుజుడు కుజ క్షేత్ర ములు శుక్రుడు, శుక్ర క్షేత్రములు బుధుడు బుధ క్షేత్రములు సూర్యుడు సూర్య క్షేత్రము శుభస్థితి నొందినవి కటకము మకరకుంభములు శుభులు చూడలేదుగాని, శనిదశపోయినది. చంద్రుని కుజుడు చూచినాడు. పాపగ్రహములు పాప స్థాన ములు శుభత్వముచెందినవి. ధనుర్ లగ్నమునకు పాపగ్రహ ములగు శని బుధ శుక్ర, దశలుపోవుటయు చంద్రుని కుజుడు చూచుటయుగలదు కాన సర్వయోగములు తటస్థపడినవి సర్వ సౌఖ్యములు పొందగల శక్తి గలిగినది. గ్రహము గ్రహ స్థానములు శుభస్థితి నొందిన యోగము; ప్రబలము, ఈ జాతకమునకు దశానుకూలత గ్రహానుకూలత రెండు గలు గుట వలన గొప్ప యోగ జాతకుడై సర్వ సౌఖ్యములు

పొందగలిగెను. దశాను కూలత లేక మానవుడు సుఖింప జాలడు.

శ్రీ— ఈ సంవత్సరము పెండ్లి అవుతుంది బలమున్నదని బలము కలిసివచ్చి నాలుగైదు నెలలయినదని సంవత్సరమునకు ముందే పెండ్లి కావలసి వుండినదని చెప్పి పృచ్ఛకుల వప్పించుచున్నారే ఏ గ్రహము వల్ల చెప్పుచున్నారు.—

గు— వత్సా, వరునికిగాని, కన్యకకుగాని 7, 8, 9 స్థానములకు గురు జాతకులకు గురువు, శని జాతకులకు శని వచ్చిన వివాహ కాలము కలసి వచ్చును. ఇందులో తొమ్మిది బలమయిన స్థానము. ఇదిగాక 1, 2, 3లో శని, శని జాతకులకు గురువు గురు జాతకులకు ప్రవేశించిన 7, 8 9, గృహముల చూతురు. అప్పటిలో వివాహమునకు బలము గలుగును.—7 దాటి 8లో ప్రవేశించిన ముందు సంవత్సరమే కావలసియుండినదని 7, 8 దాటి తొమ్మిదిలో గ్రహమున్న రెండు యేడుల నుండి బలముండినదని చెప్పుచున్నాము. 1, 2, 3లో గాని 7, 8, 9లో గాని, శని గురువులు ప్రవేశించినప్పుడు పెండ్లికి బలము గలుగును. ఇందులో 7, 9 బలమైన స్థానములు, గమనించి చెప్ప వలయును.

శ్రీ— స్వామి, నీవు యేదిచేసిన, అన్యుల పొలగుటయో, పాడగుటయో తప్పదని చెప్పితిరి, ఎచ్చట ఏ గ్రహములుండిన జరుగును

గు— వత్సా, చతుర్థము బ్రహ్మస్థానము: అనగ గృహములు గృహోపకరణములు భూములు వస్త్ర వాహనము బంధుమిత్రులు మొదలగునవి స్థిరాస్తులు గల స్థానము, ఇక్కడ శుభ గ్రహ

ములగు లగ్న పంచమ నవమస్థానాధిపతులుండిన సర్వము గలుగును. 6, 8, 12 వ స్థానాధిపతులుండిన, సర్వము నాశనమగును. లేదా అన్యుల పాలగును. స్త్రీ గ్రహముండిన స్త్రీల పాలగును. శని యుండిన ముండమోపుల పాలగును. చంద్రుడుండిన చిన్నమ్మ, వదిన పెద్దమ్మ పాలగును.

శ్రీ:— స్వామి, ఈ సంవత్సరము కొత్తపని ఏదోవకటి చేయవలసియున్నది. అనగా కట్టుట, కొనుట, త్రవ్వుట, పోతది క్రొత్తగా చేయుట చెప్పుదురు. ఏ గ్రహము ఎక్కడున్న ఇవి చేయుదురు.

గు:— వత్సా, చతుర్థమునకుగాని దశమమునకుగాని, గోచార రీత్యా లగ్నపంచమ భాగ్యాధిపతులు వచ్చిన క్రొత్తపని ఏదోవకటి చేయింతురు. నవమాధిపతివచ్చిన, తప్పక చేయించును. సమయమునకు ధనము చేకూర్చును. జనన కాలములో చతుర్థ దశమములలో పాపులుండినవారికి కష్టముతో కారమగును, నష్టకష్టములు సంప్రాప్తించును. పాప గ్రహమును శుభగ్రహము చూచుచుండిన, తప్పక తయారగును-గురు శనులకే గోచార రీత్యాబలము, గురుడుండిన దేవునికి, ధర్మమునకు అన్యాయముగా: దుర్వ్యయముగా పోవును, కుజుడుండిన, అన్నతమ్ముల పాలగును, లేదా అక్కచెల్లెండ్రపాలగును, రవి యుండిన, పినతండ్రి, పెదతండ్రి పాలగును కేతుదశపోయిన రాహువుండిన అన్యుల పాలగును, రాహువు పోయిన, కేతువుండిన ఆశ్రమముల పాలగును, శుభులుండిన తన వంశము వారే ననుభవింతురు, చతుర్థ దశమములో పాపులుండిన సర్వము లయమై దుఃఖింపచేయును. శుభు

లుండిన దినదినాభివృద్ధిగా ఆదాయము పెరుగును. వంశ వృక్షము పెరుగును. కుజుడుండిన ఇంటి ముందు వెనుకల పూలచెట్లు కాయగూరల చెట్లు ఫల వృక్షములు గలుగును.

శ్రీ— వివాహమునకు డబ్బు [వరదక్షిణ] అడుగక ఇచ్చినంతకు సంతోషపడిన వెంటనే, వివాహమగును. ఇంత పెట్టవలయు నని గీటు గీచిన, వివాహమగుట కష్టమని చెప్పుచున్నారే, ఏ, ఏ స్థానముల బట్టి, ఏ గ్రహముల బట్టి తెలుపుడు,

గు— తొమ్మిదవ యిల్లు ఖాలీగా వుండడముగాని, పాపగ్రహవీక్షణ గలుగుటగాని, పాపగ్రహ మందుండుటగాని వుండిన డబ్బు రాదు. మళ్ళీ యిస్తామని చెప్పి యివ్వలేరు—ఇచ్చినకాడికి సంతోషించిన వివాహమగును. నవమాధిపతి శుభస్థానము లలో పాపులతో చేరక పాపగ్రహ వీక్షణ లేకుండ వుండిన కొంతవరకు లభించును. దశమ చతుర్థములలో నవమాధిపతి వుండిన భూమి లభించును. 3, 6, 8, 12లో నవమాధిపతి వుండిన, చెప్పి తప్పించుకొందురు మధ్యలో కన్యకకు ప్రాణ గండమగును.

శ్రీ— పిల్ల బాగుండిన డబ్బురాదు. డబ్బు వచ్చిన పిల్ల బాగుం డదు. అంటున్నారు కారణము.

గ— శుక్ర గ్రహము బాగుండిన పిల్ల బాగుండును, నవమమున పాపులుండుటతో చూచుటతో శూన్యమై యుండుటతో గలిగిన ద్విసంధి యేర్పడి, పిల్ల బాగుండిన డబ్బురాదు. డబ్బువచ్చిన పిల్ల బాగుండదు. డబ్బురావాల, పిల్ల బాగుండాలని, తిరు గుతు కాలము వ్యర్థము చేయుదురు. నవమము చెడిన ఇట్టి చిక్కులేర్పడును. ఎంత సంపాదించినను తొమ్మిదిలో శుభ

గ్రహములేకుండిన డబ్బు నిల్వకానేరదు. 10 ఇంటిలో శుభ గ్రహముండిన ఆర్జన గలుగును 2లో శుభగ్రహము లేకున్న డబ్బు నిలువదు. స్థిరాస్థి యేర్పడును

శ్రీ- గ్రహానుకూలత అనానుకూలత గలదని చెప్పుదురు.

గు- గురు పాలితులకు పూర్వాభాద్ర, పునర్వసు విశాఖలో జనన మైన దశానుకూలత యేర్పడును. కృత్తిక, ఉత్తర, ఉత్తరా షాడలో జననమైన అనానుకూలత యేర్పడును, అనగా బాల్యమున పాపగ్రహదశలు పోయి శుభ గ్రహదశలు మిగిలి నవారే దశానుకూలత గలవారు వీరు బాల్యమున కష్టబడి 40 యేడుల నుండి ధనికవర్గములో చేరి స్థిరాస్తుల చరాస్తుల సంపాదించి సౌఖ్య పడుదురు. అనానుకూలత గలిగిన, బాల్యము చక్కగా జరిగి కౌమారదశనుండి సర్వము పోగొట్టు కొని దుఃఖింతురు. దశానుకూలతలేని జాతకులు. మధ్యరక జీవులై దుఃఖింతురు వీరి ఆశయముల తీరవు.

శని పాలిత జాతకములకు దశానుకూలత శుక్ర దశాం త్యము నుండి బాల్యముననే రవి, చంద్ర, కుజ, రాహు, గురు దశలు పోయి లగ్న పంచమ నవమాధిపతుల దశలు మిగిలి సుఖింపచేయును. గురు దశాంత్యము నుండి ప్రారంభమైన అనానుకూలత యేర్పడి, వృద్ధాప్యమున చిక్కులకు లోను గావలసి వచ్చును, దశానుకూలత గ్రహానుకూలత గలవారే ప్రకృతిలో సుఖపడు గొప్పవారు. గ్రహానుకూలత దశాను కూలతలేని వారే కాయకష్టముతో జీవించువారు. సేవకులై జీవించువారు.

శ్రీ- ఇలువేల్పును విడచి అన్యదైవమును అన్యమతమును అన్య గ్రామము అన్య దేశమును చేరుటకు గ్రహము లెట్లుండును

గు– వత్సా, ఇలువేల్పును, విడచి, అన్యదైవమును నమ్ముకొని కొలుచుట ధ్యానించుట తొమ్మిదింట పాపగ్రహముండిన అన్యదైవమును నమ్మి ధ్యానించును–అన్యమతమును పుచ్చుకొనుటకు, నమ్ముకొనుటకు పంచమములో పాపగ్రహముండవలయును. జాతకాను గుణ్యముగా కొలుచుకొను దైవమును విడపించి మరొక దైవమును చూపించు గురువు లభించుటకు పంచమము చెడిపోవును. చక్రానిత్రోవ చూపు గురువు లభించడు–అన్యగ్రామము చేరి జీవించుటకు, పంచమములో పాపగ్రహ మేకారణము, పాపగ్రహములెన్ని పంచమములో నుండునోచూచునో అన్నిగ్రామములు అంతమంది గురువులు మారుదురు–అన్యమతము, అన్యగ్రామ నివాసము, అన్యమార్గము భోధించు గురువు అన్యభాష, పంచమము చెడినవారికి తటస్థించును.

శ్రీ– స్వామి, చరాచర కర్తలగు త్రిమూర్తుల త్రిదేవతల కొలువక బుద్ధ సన్యాసుల నమ్మి వారిసేవ చేయుచున్నారే వారికి, గ్రహము లెట్లుండును.

గు– వత్సా, ఇట్టివారికి పంచమ నవమములలో పాపగ్రహము లుండును, ఈ స్థానములలో పాపులై శని బుధులుందురు. వీరు, సన్యాసులతో, మంత్రగాళ్ళతో రాబోవుజన్మను, ప్రకృత జన్మను నాశనము చేయింతురు, లేక వారినే సన్యాసులుగా మంత్రగాళ్ళగా తయారుచేసి మోసముతో ప్రజలను పీడింప చేసి పాపభూయిష్టులుగా తయారుచేసి, ఇహపరముల రెంటిని చెరతురు సన్యాసమునకు శని అధిపతి, మంత్ర యంత్రములకు బుధుడు అధిపతి, శని పాలిత జాతకులకు, మేలు

చేతురు, గురు పాలిత జాతకులకు, కీడు చేతురు.

శ్రీ- నీకు రెండు భావులుండపలయునే వున్నవా అంటున్నారే, ఏ గ్రహమువల్ల.,

గు- వత్సా, చంద్రుడు నీటికి, భావులకు అధిపతి చంద్రునియున్న గ్రహములు చూచునో అన్ని భావుల అగును-పాపగ్రహములు చూచిన, పాడగును శుభగ్రహములు చూచిన, నిలుచుకొని ఆదాయమునిచ్చును, లేదా పుణ్యము గలిగించును-చంద్రుడు శుభుడై 4, 10లో నుండిన ప్రజలకు పకరించు భావుల గా నుండును. చాలా బలిష్ఠులుగా నుండిన కోనేర్లను త్రవ్వించును, ప్రయాణికులు, నీళ్ళు త్రాగి సేద తీర్చుకొనుటకు సత్రముల కట్టించును. సంపూర్ణ తీర్థయాత్రల సేవింప చేయును. పుణ్యమును సంపాదింప చేసి మరుజన్మకు మహా రాజును చేయును. కీర్తి గౌరవ ప్రతిష్టలు సంపాదింప చేయును. చేసినదానము కట్టించినకట్టడములు స్థిరస్థాయిగా నుండచేయును. సూర్యచంద్రులు బలవంతులు. వీరు పాపులుగా చతుర్థ దశమములలో నుండిన సర్వనాశనము చేయుదురు. ముందుజన్మలో తల్లిదండ్రులకు అన్నము పెట్టక, వారి యోగక్షేమముల విచారించక పోయినవారికి ప్రభుత్వ ధనము తిని,ప్రభుత్వమునకు అన్యాయముచేసి, అటు ప్రభుత్వమునకు ఇటు ప్రజలకు అన్యాయము చేసినవారికి, చతుర్థ దశమములలో సూర్య చంద్రులుండి, తినను తిండి కట్టను బట్టలేకుండచేతురు. గుడ్డిగా చేతురు.

శ్రీ- వివాహానికి పెండ్లివారిని తీసుకొని పోవు వాహనములు పడి చనిపోవుదురే పెండ్లి కొడుకు వల్లనా, పెండ్లి కూతురు

వల్లనా ఈ దుస్సంఘటన చేకూరుట ఏమందురు

గు_ వత్సా, రుణాను బంధరూపేణ పశు పత్నీ సుతాలయు అన్న వచనము విన్నావుగద పురుషుని రుణమే భార్య పుత్రులు పుత్రికలు బంధు మిత్ర పరివారము స్థిర చరస్తులు అనగా సర్వసము పురుషుని రుణమేనని జ్యోతిషము చాటుచున్నది గదా వివాహము కూడ అతని యోగమే ననవలయును. ఆత నికి సప్తమాష్టముల పాపగ్రహములుండి చతుర్థమున అష్టమా ధిపతిగాని, వ్యయాధిపతిగాని వుండిన అట్టి విపత్తులు తటస్థిం చును. దశమములో పాపులుండినను తటస్థపడును. పాపుల శుభులు చూచుచుండిన విపత్తు కలిగి బ్రతుకుదురు. వరుని కుండినట్లే వధువుకు వుండును. రెండుతోడైన చావులుతప్పవు సప్తమష్టమముల శని పాపియై బలముగా చూచిన చావులు తప్పవు, కళత్రస్థానము పాపగ్రహ స్థానమగును, ప్రతిలగ్న మునకు కళత్ర స్థానమనగా లగ్న సప్తమము అక్కడ లగ్న పంచమ నవమ స్థానాదిపతులు లేక, చూడకపోయిన ఆ స్థలము కనకనలాడే నిప్పుల గుండమగును. మరి పాపగ్రహ ములగు 3, 6, 8, 12 స్థానాధిపతులుండిన రోగగ్రస్తులుకోప గ్రస్తులు దూరగ్రస్తులు, శోకగ్రస్తులు, నేరగ్రస్తులుగా తయా రుచేసి,సంసారము కళత్ర సుఖము చెరతురు, వివాహ సమ యములలో అనేక అపశకునముల విపత్తుల చిక్కుల అసౌక ర్యముల ఆహార విహారములలో లోటు కలహములు మనస్తా పములు గలుగు చుండును, చతుర్థమున పాపగ్రహమున్న, బంధువులు స్వకులస్తులు వివాహములో రాక అన్యకులస్తుల తోడు గలిగించును-చతుర్థములో నొకపాపగ్రహముండినబంధు

మిత్రాదులు కొందరు వివాహములో కలియరు. వాహన గండములు జరుగును దారిమధ్యలో వాహనము చెడిపోయి చిక్కుల గల్పించును.

ఇక అష్టమము మాంగల్య స్థానము దీనిలో ఎలాటి పాపగ్రహముండునో అట్టి విపత్తులుసంభవించును చంద్రుడు న్నవర్షమువల్ల పాలు త్రాగు పిల్లలవల్ల గర్భఘాతులవల్ల చిక్కులు గల్పించును. గుజుడుండన ఎత్తునుండి క్రింద పడుటవల్ల కలహములవల్ల ఇట్లే అన్ని గ్రహములవల్ల గలుగును. పాప గ్రహము యట్టిదో గమనించవలయును.

శ్రీ- స్వామి, హిందువులు సూర్యునకు నమస్కరించు చుంటారు. ముసల్మానులు చంద్రునికి నమస్కరించు చుంటారు. హిందువులు చంద్రునికి నమస్కరించరు జ్యోస్యులు చంద్రబలము జాతకునికి ముఖ్యముగా వుండవలయుననెదరు. వివాహములో చంద్రబలము ముఖ్యముగా చూచు చుండెదరు. కొన్ని దేశములలో ఇది వక యంత్రముగా భావించుచున్నారు. ఏది నిజమనెదరు,

గు- వత్సా, సూర్యుని కొందరు యంత్రమని తలంచుచున్నారు. ఆర్యులు త్రిమూర్త్యాత్మకమైన భగవత్ స్వరూపమనుచున్నారు జ్యోతిశ్శాస్త్రము గ్రహరాట్ అనియు, ప్రభుశక్తి వారియందే వున్నదనియు కర్మసాక్షి, జగత్ చక్షువనియు ప్రపంచమునకు విజ్ఞాన చక్షువనియు అర్ఘ్య ప్రదానము త్రిసంధ్యల విడుచుచు, ధ్యానించుచున్నారు అరుణము. ఆదిత్య హృదయము అష్టోత్తరము సహస్రనామ స్తోత్రము, మంత్రము యంత్రము, కవచము మొదలగునవి పెద్దవారివల్ల గ్రహిం

చుకొని ఆచరణలో నుంచుకొనుచునే వున్నారు. వీరికి జనన కాలములో జాతకమున పంచములో నొక శుభ గ్రహ మున్నవారు పాప గ్రహ మున్నవారు ఎంత చెప్పినా ఆచరించడు, ఆచరణలో నుంచుకొన్నవారికి సుఖము గలుగును. ఆచరణలో నుంచుకొనని వారికి ఈ జన్మలో రాబోవు జన్మలో సుఖముండదు-సూర్యచంద్రులు శుభులైగాని కటక సింహ మేష వృశ్చికములలో లగ్న పంచమ భాగ్య స్థానాధిపతులు, ఉన్నవారే ప్రభుత్వరంగమున వన్నె గడించి ఆనందించువారు. పకృతమున్న ఉద్యోగులందరికి ఇట్టి లక్షణములు గలిగియుండును-సూర్య చంద్ర కుజుల అను గ్రహము లేక ప్రభుత్వోద్యోగి కాజాలడని జ్యోతిషము నిరూపించుచున్నది హిందువులు చంద్ర గ్రహ ధ్యానము చేయరు. ముసల్మానులు సూర్యుని ధ్యానము చేయరు. ఇది మతవైషమ్యము ఇరువురురిని ధ్యానించినవారు ధన్యాత్ములు. దేహకారకుడు సూర్యుడు మనోకారకుడు చంద్రుడు గాన సర్వులకు వందనీయులు పూజనీయులు చంద్ర బలమున్నవారికి గ్రాహితశక్తి జ్ఞాపకశక్తి సమయస్ఫూర్తి జ్ఞానము ప్రబలముగా నుండును. సూర్య బలమున్నవారికి దేహబలము దేహ సౌష్టవముండును సంవత్సరము పాసిత్వ సామ్రాజ్య పదవీంలభేత్ అని సూర్య ఫల శృతిలో నున్నది అన్నట్లే జరుగుచున్నది. ఉదయమే ఒకసారి నమస్కారము చేసినవారికి కూడా ప్రభుత్వ రంగమున స్థానమున్నదనియే జ్యోతిషమున తేలుచున్నది- ఇక సూర్యోదయ సమయమున పాలో, పండో, చక్కెరో పెట్టి ఎదురుగా నిలిచి అష్టోత్తరమో కవచమో ధ్యాన శ్లోకములో మంత్రమో, ఆదిత్య హృదయమో చెప్పి నైవేద్యము చేసిన వారు రాజుగ జన్మించి సర్వసౌఖ్యములు పొందగలుగుదురని

జ్యోతిషము నొక్కి చెప్పుచున్నది. ప్రమాణముల జాతకముల చెప్పుచున్నది.

శ్రీ- రెండు గ్రామములు అనియు రెండు పొలిమార్లు అనియు పృచ్ఛకులకు చెప్పుచున్నారే వారికి గ్రహము లెట్లుండును.

గు- వత్సా, పంచమము గ్రామ స్థానము పంచమములో పాప గ్రహములుండిన స్వగ్రామమున నివసింపజాలడు. అన్య గ్రామ నివాసియగును. ఎన్ని గ్రహములు పంచమము చూచునో అన్ని గ్రామములు తిరుగగలవాడగును. అదే స్థానమున శుభ గ్రహములుండిన ఎన్ని వుండునో అన్ని గ్రామములలో భూములు గృహములు వుండను. శుభ గ్రహమువల్ల స్వగ్రామమున బలము గలిగి స్థలముననే వుండును. శుభులు దశపోయి పాపులు మిగిలిన తప్పక స్వగ్రామము విడుచును. గ్రహబలముల గమనింపవలయును

శ్రీ- తల్లి తండ్రి గురువు దైవము అను నాలుగు మెట్లిలలో గురువునే నమ్మి దైవమును మరచిన మతములున్న నే నాలవ మెట్టు చేరగలరా,

గు- వత్సా, అణిమా ద్యష్ట శిద్ధిని పొంది జీవ సమాదిని పొందిన గురువుల నమ్మినవారు. గురువువల్ల పోతగిన లోకమునకు పోగలుగును. తిరిగి వచ్చి, అట్టి గురువులు చూపిన మంత్రి సాధనతో స్వప్నావస్థలోగాని జాగ్రదా వస్థలోగాని దైవదర్శనము పొందగలిగి ముక్తిని పొందును. మోన గతి గురువుల నమ్మి ఇహ పరముల చెరచుకొనును. అట్టివారికి పంచమమున పాపగ్రహములుండును. ఈశ్వరా రాధన చేయవలసిన వానికి విష్ణువు నారాదించునట్లుగను. విష్ణువు నారాదించు వారికి శివారాధన చేయునట్లు చేయు గురువు లభించి జీవిత కష్టమును చెరచును. ఈ విషయము జ్యోతిశ్శాస్త్రమునకే

తెలియును. వేరు శాస్త్రములకు తెలియదు. ముందు జన్మ మున ఈశ్వరు నారాధించి మానవత్వము లభించినవారు. మకర, కుంభ, వృషభ, మిధున కన్య తులలో జన్మించును. విష్ణువు నారాధించి జన్మించిన వారు, మీన, మేష, కటక సింహ వృశ్చిక ధనస్సులందు జన్మింతురు ఈ విషయము తెలిసి గురువు మార్గ దర్శకుడు గావలయును. అట్లుకాని యెడల చేసిన కష్టము, వృధాయగును. లేదా పాపపరిహార మగును కష్టములు మెండగును.

శ్రీ- స్వామి, కలియుగములో అయిదువేల యేండ్లకే తల తోకగా తోక తలగా మారుచున్నదే నాలుగు లక్షల ముప్పయి రెండు వేల సంవత్సరములకు ఏ విధముగా మారుతుందో ఏమో చూడ శక్యముగాని పద్ధతులు గలుగునను కొందును."

గు- వత్సా, ప్రకృతము కలికాలములో శని, భుక్తిలో అంతర్ భుక్తి శుక్రభుక్తి వచ్చి 35 సంవత్సరములైనది. దీని ప్రమా ణము మూడు నూర్ల యేండ్లు, యిక 265 సంవత్సరములు వున్నది, స్త్రీల ప్రాబల్యము యెక్కువగును. పురుషులకన్నా మిన్నగా ఉద్యోగములు చేయగలుగుదురు. కవులు గాయ కులు. విమర్శకులు వైద్యులు వ్యాపారస్తులు నటునలు మొద లగు వాటిలో అగ్రస్థాన మాక్రమించుకొందురు. ఇది శుక్ర గ్రహపాలన శుక్రుడు స్త్రీలకదిపతి యగుటయేగాక యువ తులకు అదిపతి, అందువల్ల మహారూపవతుల పుట్టించు చున్నాడు. వీరివల్ల పురుషులకు మానహాని ప్రాణహాని తప్పదు. వర్ణాంతర వివాహములు విడాకులు విపరీతముగా జరుగును, సప్తమాష్టమములలో పాపగ్రహములున్న జాత కులు విపరీతముగా జనన మగుదురు, వరదక్షిణ మేర తప్పి

నడుచుట ఇందుకే వంశ నాశనమునకు మూలము స్త్రీ ధనము విధవ ఆస్తులు, విధురుని ఆస్తులు గోడ్రాలి ఆస్తులు అన్యాయార్జన చోరధనము, మొదలగు నవియని తెలుసు కొనుము.

శ్రీ– స్వామి, మేష, సింహములలో గురువు వచ్చినపుడు వివాహాది శుభకార్యములు చేయకూడదన్నారు శాస్త్రమేనందురా!

గు– గురువు మేషమునకు భాగ్య స్థానాధిపతి సింహమునకు పంచ మాధిపతి గాన శుభములో శుభముగాని శాస్త్రవేత్త కుజ,రవులు పాపులుగా భావించినాడు. వారి ఇండ్లలో గురువుండిన శుభము అ శుభముగా మారునని వారి భావము. అందువల్ల కూడదన్నారు. ఇది శాస్త్రముగాదు మేష, సింహములకు గురుడు, శుభుడుగాన చేయుట శ్రేయోదాయకము.

శ్రీ– స్వామి, వివాహము పుట్టిన ఊరిలో అవుతుందా బయట ఊరిలో అవుతుందా అనేదానికి గ్రహములు ఎట్లుండవలయును

గు– లగ్న పంచమములో లగ్న పంచమ నవమాధిపతులుండిన పంచమము స్వగ్రామముగాన బలీయముగ గ్రహములుండిన పుట్టిన వూరిలో కాగలదు–చతుర్థమున శుభులుండిన బంధువు లున్న వూరిలో నగును సప్తమ, అష్టమములలో పాపులున్న విడిపోయి అన్య గ్రామములందు కాగలదు. సప్తమ అష్టము లలో శుభులున్న బంధు వర్గములో నగును. శుక్ర గ్రహము పాపియై వేరు పాపులతో చేరియుండిన రెండు వివాహములు తప్పవు. చంద్రుడు పాపియై చతుర్థము నందు దశమములో నున్న తల్లి లేని పిల్లల చాకవలసి వచ్చును.

శ్రీ– స్వామి, పుట్టబోయేది ఆడ, మగ, అనేదానికి గ్రహములు ఎట్లుండవలయును.

గు— పంచమాధిపతి, చంద్రుడు పురుష గృహములలో నున్నను. చంద్రుడు పురుష గ్రహముతో చేరి యున్నను పురుషుడు–స్త్రీ గ్రహములతో స్త్రీ గృహములలో నున్న స్త్రీ జనించును. మీన, మేష, మిధునము, సింహ, కన్య, వృశ్చిక ధనుస్సులు–పురుష గృహములు. వృషభ, తుల, మకర, కుంభ, కటకములు స్త్రీ గృహములు పంచమాధిపతి పురుష గృహములో నుండిన దశమము పురుష గృహమై శుభులుండినను పురుషులు జనింతురు. లగ్నపంచమాధిపతులు పురుష గృహములందున్నను పురుషులు జనింతురు.

శ్రీ— స్వామి, ఏల్నాటి శని వచ్చినపుడు మనుష్యులను భాదిస్తుందా. ఎట్లు ఉంటే భాదించదు.

గు— ద్వాదశము ప్రారంభము నుండి ద్వితీయము దాటు నప్పటికి శనికి, ఏడున్నర సంవత్సరకాలము పట్టును. ఇది గురు లగ్నములకేగాని శని పాలిత లగ్నములకు చెల్లదు. శని పాలిత లగ్నములకు మేలు కలుగును.

గురు పాలితములకు 12, 2, 6, 9 ద్వాదశములో నుండి చూచును. లగ్నము నుండి 3, 7, 10 స్థానముల చూచును. ద్వితీయము నుండి 2, 4, 8, 11 స్థానముల చూచును. ఆయా స్థానముల సత్ఫలముల చెరచి దుష్ఫలముల గల్పించును గాన ఏల్‌నాటి శని అని చెప్పినారు. ఏ లగ్నములకని అడిగినవారు లేరు ఎద్దు ఈనిన దనినగాట కట్టి వేయమన్నారు.

శ్రీ— స్వామి, స్త్రీలకు కనుబొమ్మలు రెండునూ కలిసి ఉంటే వెద్ద అని అంటారు. అది నిజమా.

గు— స్త్రీల కొకరికేకాదు. పురుషులకు కూడ కనుబొమ్మలు కలిసి

యున్న ద్వికళత్రయోగము నిజము. స్త్రీకి వుండిన పురుషుడు పురుషుని కుండిన స్త్రీ సళింతురని వాడుకలోనున్నది! రెండు చోట్ల చూడడమైనది.

శ్రీ— స్వామి, ఒక జాతకుడు జన్మ స్థలములో నివసించకుండా ఇతర గ్రామములో నివసిస్తారే అటువంటివారికి గ్రహములు ఎట్లుండవలయును.

గు— జాతకుని లగ్న పంచమము గ్రామస్థానము ఆ స్థానమును ఎన్ని గ్రహములు చూచునో అన్ని గ్రామములలో కాపురము చేయవలసివచ్చును. లేక అన్ని గ్రామములలో భూములు, ఆస్తిలు వుండిన స్వగ్రామముననే వుండును. శుభులు చూచిన వుండిన స్వగ్రామముననే వుండును. గృహమునుకాని గ్రామమును గాని పాపగ్రహములున్నను బలముగా చూచినను విడచుట నిశ్చయము.

శ్రీ— స్వామి, ఒకనివద్ద డబ్బు తీసుకొని ఆ డబ్బును తిరిగి ఇవ్వకుండ ఎగరేస్తారు. ఆ డబ్బు తిరిగి రావాలంటే ఏ దేవుని పూజ చేయవలెను. ఎట్లు చేయవలెను. లేక ఏ గ్రహమును పూజ చేస్తేవారు తిరిగి ఇస్తారు.

గు— ఇచ్చిన డబ్బు రావలయుననిన ఆరింట తొమ్మిదింట శుభ గ్రహములుండవలయును పాపగ్రహములుండిన ఇచ్చిన రాదు. తెచ్చిన తీరదు. ఇప్పించిన ఉరువు మనిషి కానరాదు ఇది పూర్వ జన్మ పాపము కాన ఏ దేవుని పూజించినరాదు.— గోచారరీత్యా శని పాలితులకు శని గురు పాలితులకు గురువు ఆరింటికి వచ్చినా చూచినా ఇంతో అంతో రావచ్చునేగాని మహా కష్టము. ఏ దేవుడు ఇప్పించలేడు.

శ్రీ— స్వామి, బుధ గ్రహము ఎట్లుండిన లేదా ఎవరి చేత చూడబడినప్పుడు జపము చేస్తే ఆ జపము సిద్ధిస్తుంది.

గు— భాగ్య స్థానాధిపతి జనన కాలములో భాగ్యములో నుండుట గాని, పంచమాధిపతి పంచమములో నుండుటగాని వుండిన దైవానుగ్రహము పొందగలడు. బాల్యమాదిగా దైవశక్తి ఆర్జింపవలయునను ఆశ జనించును. ధ్యానము చేయును. జన్మ సార్థకము కాగలదు.

శ్రీ— స్వామి, శాంబరీ విద్య అనగానేమి? మాతులన్యాయము అనగా నేమి? ఎట్లు ఉంటే మాతుల న్యాయముంటుంది? ఎవరితో భాధ? శుక్రగ్రహ కారత్వములో గూడా శాంబరీ విద్య అని వ్రన్నది అంటే ఎమిటి? వామాచారమనగానేమి? బలి పిట్టెడి స్థలము అంటే ఎమి?

గు— శాంబరీ విద్య పూర్వకాలమున రాక్షసులు సాధించి అందరిని మాయలతో భాదించినారు. ఇది చండి, బగళా, చాముండి మొదలగు క్షుద్ర దేవతల స్వాధీనము చెసుకొని వారివల్ల ఇష్ట కామ్యముల నెరవేర్చుకొన్నారు. దీనికి కారకత్వము బుధుడు మాతుల న్యాయము మేనమామ అతని కొడుకులు పిల్ల నిచ్చిన మామ బావ మరదులు చెల్లెంద్ర అక్కల నిచ్చినవారు వారి సంతతి మొదలగు వారు మాతుల న్యాయము.

గురు జాతకులకు బుధుడు పాపిగాన బుధుడు మాతులన్యాయమునకు కారకుడు. శని పాలిత జాతకులకు శుభుడుగాన మాతుల న్యాయము వారిని భాదింపదు. లాభముగా నుండును. బుధ, శని, శుక్ర రాహు గ్రహములు మాతుల న్యాయము గలవి. గురు, కుజ, రవి, కేతు గ్రహములు పితృ, సోదర, న్యాయము గలవి. చంద్రుడు మాతృ న్యాయము గలవాడు. గాన ఇహ సంబంధముగల క్షుద్ర విద్యలు, శని, బుధ, శుక్ర, రాహు గ్రహములకును పరోక్ష

జ్ఞానమునకు, విష్ణుసంబంధ విద్యలకు గురు, కుజ, రవి, చంద్ర, కేతు గ్రహములు అందువలన శుక్రునికి కూడా శాంబరీవిద్య అలవడవచ్చును. వామాచారులనగా హింసా సిద్ధాంతులు అమ్మవారికి బలిపెట్టువలములు వారిని వామాచారులందురు.

శ్రీ— స్వామి, కొన్ని జాతకముల వారికి సంతానమే కలగదు. వారికి గ్రహములు ఎట్లుండును. సంతానము కలగాలంటే ఏ గ్రహమును పూజ చేయవలెను. లేక ఏ దేవుని పూజించవలెను. అటువంటి వారికి సంతానము కలుగుతుందా కలుగదా!

గు— పంచమములో పాప గ్రహములుండి వంశవృద్ధి స్థానముగు దశమములో పాప గ్రహములున్న యెడల సంతతి వుండదు అట్లు వుండిన రోగగ్రస్తులు. కోపగ్రస్తులు మాతృ పితృ గురు దేవ బ్రాహ్మణ సాధు సజ్జనులతో ధూషణలు తిసువారుందురు. సంతతి కలుగవలయుననిన బపిష్టి రక్తము మార్పు జనించి యుండును. దానిని రక్తము వన్నెకు వచ్చునట్లు ఓషధులతో మార్పుకొనుట పంచమ దశమ చతుర్థములలో గల పాపగ్రహములకు దానము ఇచ్చిన సంతతి గలుగును. గురుపాలితుల విష్ణు పరముగ శనిపాలితులు శివునిపరముగా పూజలు చేసుకొనుట శ్రేయము. పంచమ దశమములలో పాపగ్రహము బలీయముగా నుండిన వంశమే శూన్యము. సప్తమమునకు పంచమము దశమము శుభస్కారముగా నుండిన రెండవ భార్యకు సంతతి కలుగును. పంచమములో దశమములో నున్న పాపగ్రహ దశలు పోయిన కొందరికి కలుగుదురు.

శ్రీ స్వామి, కొందరు విద్యార్థులు కొన్ని క్లాసులలో తప్పిపోయి మరల పాసగుచుందురే దీనినేమందురు. విద్యార్థి ఏ దేవుని

ప్రార్థన చేసిన విద్యా చక్కగా నుండును. సమయస్ఫూర్తి జ్ఞానముల లభించును శలవిండు.

గు- శ్రీవత్సా, పంచమములో పాప గ్రహమున్న వారు సమయ స్ఫూర్తి జ్ఞానము తక్కువై అప్పుడప్పుడు తప్పి పోవుచుందురు పంచమాధిపతి శుభస్థితి జెందియుండినను అనగా, నవమము లోగాని లగ్నములోగాని ఉండిన తిరిగి పాసగుచుందురు. విద్యాకాలములో లగ్న పంచమ నవమాధిపతుల దశలుండి నను పాసగుచుందురు-పంచమములో శుభులుండిన వాని బుద్ధి బలము చక్కగా నుండును. గ్రాహితశక్తి జ్ఞాపకశక్తి సమయస్ఫూర్తి జ్ఞానము చక్కగా నుండును. వారు ఏది తలంచినా తలంచినది గమ్యస్థానము చేరును.

విద్యకు ఆధార భూతము సరస్వతి ఆ మహాతల్లి దయను సంపాదింపవలయు. నిత్యము సరస్వతి అష్టోత్తర ముగాని, సహస్ర నామముగాని చెప్పి పాలో పండో చక్కెరో బెల్లమో నైవేద్యము పెట్టి తానింత ప్రీతిగా భుజిం చిన ఎట్టి మందబుద్ధియైన పాసుకాగలడు సమయస్ఫూర్తి జ్ఞానము గలుగును. ప్రతి విద్యార్థి చేయుట శ్రేయో దాయకము.

శ్రీ- స్వామి, ఉద్యోగము ఎప్పుడు వచ్చును. ఏ దశా భుక్తుల లోన, గోచార రీత్యా గ్రహములు యచ్చటికి వచ్చినప్పుడు వచ్చును.

గు- వత్సా, ఉద్యోగస్థానము దశమము వృత్తి ఉద్యోగ వ్యాపార్య గౌరవ జీవనస్థానము దశమమేయగును. జననములో దశమ ములో నొక శుభ గ్రహమున్న వానికి ఉద్యోగము అడుగకనే వచ్చును. పాపగ్రహమున్న వానికి కష్టపడినను రావు. అట్లులేని వానికి, గోచారరీత్యా దశమమునకు శుభ గ్రహమువచ్చినా

చూచినా బలాబలముల ననుసరించి ప్రయత్నము చేయించును. జననములోగాని ప్రశ్న లగ్నాత్‌గాని రాజకీయ స్థానములకు కటక సింహ, మేష, వృశ్చిక-ములలో శుభ గ్రహములున్న ప్రభుత్వోద్యోగి యగును ప్రభుత్వధనము తినుయోగము ప్రజాధనము తినుయోగము అను రెండింటిని గమనించవలయును ప్రజా ధనమునకు, చాలా దారులున్నవి, వైద్యము, జ్యోతిష్యము, వ్యాపారపు కళలు మొదలగునవి గాన బాగుగా యోచించవలయును.

శ్రీ- స్వామి, బిడ్డ జాతకము చూచి ఈబిడ్డ తరువాత పుట్టబోయేది తమ్ముడా, లేక చెల్లెలా అన్న ప్రశ్నకు గ్రహము లెట్లుండవలయును.

గు- వత్సా, తండ్రి వంశములో ఆడపిల్లల గలుగునట్లున్నదా! మగ పిల్లల గలుగున్నట్లుదా! అను విషయము తెలుసుకొనవలయును. లగ్న నవమము నుండి దశనము చూడవలయును. [పితృ స్థానము నుండి దశమము.] ఆ లగ్న తృతీయము. పురుష లగ్నమా, స్త్రీల లగ్నమా తెలుసుకొనవలయును. తృతీయాధిపతి వున్న లగ్నము. పురుష స్థానమా లేక స్త్రీ గృహమా, చూడవలయును. చంద్రుడున్న స్థలము ఇట్లే చూడవలయును. వీటిలో బలము గమనించి స్త్రీ పురుష సంతతిని చెప్పవలయును ఇది గమనించుటకు చాలా కష్టము బుద్ధి బలముపయోగించవలయును.

శ్రీ- స్వామి, రాహు గ్రహము ఎక్కడుండిన గుండక గోళక చోర జీవనము సంప్రాప్తమగును.

గు వత్సా, జీవనక్షేత్రమగు దశమ చతుర్థములలో కేతు దశ పోయిన రాహు వున్న యెడల దొంగబుద్ధి పుట్టును. దొంగ సొత్తుల కొనును. దొంగ వ్యాపారము చేయును కలితీ వస్తువుల విక్రయించును. గుండక గోళక వంశమున జనిం

చిన వాడగును. ప్రజలచే దూషింపబడును. జీవితమంతయు, చోరవృత్తితో బ్రతుకును.

శ్రీ- స్వామి, దశానాధుడు అష్టమాదిపతి ఐయినప్పుడు ఏలాటి గండములు కలుగగలవు దీనికి పరిహారమేమిచేయవలయును

గు- వత్సా, దశానాదుడు అష్టమాడిపతియై యుండిన ఎచ్చోటు వుండినను దశవచ్చినప్పుడు బలాను గుణ్యముగ బాదించియే తీరును. మేష, మిదున, సింహ, తుల, కుంభములకు అష్ట మాదిపతి దోషములేదు. ఈ లగ్నములకు అష్టమాదిపతి ఆ లగ్నములకు మిత్రుడే యగును. గాన భయము లేదు. వృషభ, కటక, కన్య, వృశ్చిక దనుర్ మకర మీనములకు అష్టమాధిపతి, శత్రువుగాన బాధించితీరును. అష్టమస్థానము ఆయు స్థానము గాబట్టి ఎక్కడుండునో ఆ స్థానము చూచిన చోట పదభ్రష్టము చేయును. అష్టమాధిపతిని శుభులు చూచినను శుభులు ఆ రాశిలో అష్టమాదిపతికి వెనుక భాగమున నుండినను దీర్ఘాయువుగలుగును.—అష్టమాధిపతియే గ్రహమో ఆ దాన్యము ఆ రంగు వస్త్రము సంకల్ప యుతముగా దానమిచ్చిన కొంతవరకు నయముగా నుండును. సద్ బ్రాహ్మణునకు ఇచ్చుట శ్రేయోదాయకము, ఉన్న చోటును బట్టి గ్రహ కారకత్వముల బట్టి గండములు గలుగును.

శ్రీ- స్వామి, కొందరు, గృహమును ఆస్తిని అమ్ముకొని అన్య గ్రామములకు పోవుచున్నారు. వారి జాతక రీత్యాగాని ప్రశ్నలగ్నాత్ గాని పాపగ్రహ శుభగ్రహము లెచ్చటుండును

గు- వత్సా, లగ్న పంచమము గ్రామము గ్రామాదికారము పాండిత్య బలము, గ్రామ స్థానమును ఎన్ని గ్రహములు, చూచునో అన్ని గ్రామములలో కాపురము చేయవలయును. పంచములోవున్న పాప గ్రహదశ వచ్చిన గ్రామము తప్పక

విడుచును. చతుర్థములో పాపగ్రహము బలముగా నుండిన గృహము గృహోపకరణములు భూములు సర్వము విక్రయించి అన్య గ్రామము చేరి వసతి గృహము చిక్కక కష్టబడును. పంచమములో పాప గ్రహమున్న అన్యగ్రామము అన్యమతము అన్య కుల సహవాసము అన్య మత గురువు అన్య జాతి సంపర్కము గలుగుట తప్పదు.

శ్రీ— స్వామి, స్త్రీ జాతకమును చూచి, కాబోవు భర్త ఉద్యోగస్థుడ, వ్యాపారస్తుడా, వ్యవసాయదారుడ అని చెప్పుటకు గ్రహములు ఎట్లుండవలయును.

గు— వత్సా, స్త్రీ జాతకములో ఏ గ్రహములు బలముగానుండునో ఎచ్చటెచ్చట వుండునో తెలసుకొని, అనగా కుజుడు కుజ క్షేత్రములు బలీయమై శుభస్థితి జెందియుండిన భూమివల్లను రవి రవి క్షేత్రము, చంద్రుడు చంద్ర క్షేత్రము శుభస్థితి చెంది యుండిన దశమములో నొక శుభ గ్రహముండిన రాజకీయ ఉద్యోగిగను బుధుడు బుధ క్షేత్రములు శుభస్థితిలో నుండిన వ్యాపారిగను శుక్రుడు, శుక్ర క్షేత్రములు శుభస్థితి జెందిన కళలతోను వాహనములతోను, శని శని క్షేత్రములు శుభస్థితి చెందియుండిన నీచమైన వ్యాపారములతో అనగా, హోటళ్లు, బ్రాందీషాపులు, ప్యాక్టరీలు, ఇనప అంగళ్లతో, జీవించును. గురువు గురుక్షేత్రములు శుభస్థితి జెందియుండిన విద్యాబలముతోను జీవింతురు. ఇవి ప్రబలయోగములు స్త్రీ జాతకము పురుష జాతకమని వేరుగాలేవు. పురుష జాతకమును చూచి స్త్రీ జాతకమును స్త్రీ జాతకమును చూచి పురుష జాతకమును చెప్పనగును. స్త్రీ జాతకము చెడ్డగానుండిన పురుష జాతకము చెడ్డగానే వుండును. స్త్రీకి యేచోట శుభగ్రహముండునో పురుషునికి అట్లే వుండును.

శ్రీ— స్వామి, గోచారరీత్యా గురువు శని పాలిత లగ్నములకు 6, 8, 12, 1 స్థానములలో ప్రవేశించినపుడు శనిగలు పసుపు రంగు వస్త్రము దానమిచ్చుట శ్రేయమన్నారు. సంకల్ప యుతముగా సుండవలయునన్నారు. ఇంకొకరు శనిగలు బెల్లము ఆవుకు పెట్టమన్నారు. శాస్త్ర సమ్మతి మేనందురు.

గు— వత్సా, గోచారరీత్యా గురువుగాని శనిగాని వచ్చినప్పుడు, ధాన్య దానమిచ్చుట మంచిది. ఉదాహరణ : (వృషభ లగ్నమునకు) మమ జననకాల (లేదా) ప్రశ్న లగ్న కాల వృషభ లగ్న షట్స్థాన విశాఖా నక్షత్ర ద్వితీయ పాదస్థిత గురు గ్రహ దోష పరిహారార్థం, శుభ ఫలవాప్త్యర్థం ఆయురారోగ్య భాగ్య వృద్ధ్యర్థం. నారికేళ, ఫల, పుష్ప, తాంబూల దక్షిణ వస్త్ర సహిత శ్చణక ధాన్య దానం కరిష్యే, అను సంకల్పముతో గురు గ్రహమును పూజించి 40, 50 యేడులు వయసుగల బ్రాహ్మణునకు దాన మియ్యవలయును.—గురువు వృద్ధాప్యమునకు కారకుడు గాబట్టి వృద్ధునకే దానిమిచ్చుట క్షేమము-ఆవులలో తరుపు, కట్టు ప్రాయమునకు శుక్రుడు ఈని పాలిచ్చు ఆవుకు చంద్రుడు ముసలి ఆవుకు శని అధిపతులు గాన ఫలము లేదు. వేదము చదువుకున్న బ్రాహ్మణుడు శ్రేయము నిచ్చును. కొంత పాప పరిహారమగును—లేదా, ముసలి ఎద్దు మంచిది. ద్వాదశాష్టము జన్మంతు శని అంగారకో గురుః 12, 8, 1 స్థానములకు వచ్చినప్పుడు బాధ పెట్టుదురన్నారు గాని అర్థము మాత్రములేదు. అన్ని గ్రహములకు చెప్పుచునేవున్నారు. అర్థము మాత్రము ఎవరికి తెలియదు, ఈ శ్లోకమునకు విశదముగా సప్రమాణ జ్యోతిస్సారము ద్వితీయ తరంగములో ఉన్నది. పరికింపుము,

శ్రీ— స్వామి, ఆరుద్ర, కృత్తిక నక్షత్రములయందు గృహారంభ

గృహ ప్రవేశాదులు, చేసిన గృహము కాలుతుందన్నారు. ఇది నిజమేనందురా.

గు- వత్సా, ఆరుద్ర కృత్తికలు దిన నక్షత్రములైన చంద్రుడుండు నుగదా. చంద్రుడేమి చేయుచుండును. గ్రహములేని నక్ష త్రము గ్రహము లేని లగ్నము ఏమీ, పని చేయదేదని వ్రాసిన వారికి తెలియును గాని, శాస్త్ర జ్ఞానము లేనందున వారట్లు వ్రాసినారు. చంద్రుడు, సర్వదా శుభుడని వ్రాయు టయే తప్పు, చంద్రుడు పాపియై ఎన్నింట నుండునో ఆ యింటి ఫలమును నాశనము చేయును చూచినింటి ఫలము కూడ నశింపు చేయును గాని ఆరుద్ర కృత్తిక ఏమి చేయ జాలవు, రవి, కుజుడు శుక్రుడు పాపులై బలియులై, చతుర్థ మును చూచిన, ఆ గృహము అగ్నిహోత్రుని పాలగుట తప్పదు 1, 2, 3, 4 భాగాలలో నుండిన బలముగా పని చేయుదురు. అనగా తొందరగా కాలిపోవును.

శ్రీ- స్వామి, రాశిలో గ్రహము ఎన్నివ భాగలో వున్నది. తెలుసుకొనుటెట్లు.

గు- వత్సా, ఒక గ్రహము ఒక రాశిలో ఎన్ని దినములుండునో తెలుసుకొని ఉదా : 20-10-82 తులలో శుక్రుడు ప్రవే శించి 13-11-82 తేది వృశ్చికమునకు పోవుచున్నాడు. అప్ప టికి 24 దినములగును 12చే భాగించిన 2 దినములువచ్చును ఒక భాగమునకు జనన కాలమునకుగాని, ప్రశ్న కాలము నకు గాని ఎన్నోవభాగాలో గ్రహమువున్నదో తెలుసుకొనవల యును, 7 భాగ లోపలగాని 7వ భాగలోగాని గ్రహమున్న యెడల వివాహమునకు బలము గలుగును.

ప్రతి స్థానములో ప్రతి విషయమునకు చూడ తగి యున్నది ఉ॥ గృహము చతుర్థము అక్కడున్న గ్రహము 1

2, 3, 4 లోపల శుభ గ్రహమున్న గృహములేని వారికి కూడా గృహము కట్టుకోగల బలము గలుగును. విద్య పంచమము, అయిదుకులోపల గ్రిహముండ వలయును. గురు శనుల మొదలుకొని అన్ని గ్రిహములకు అన్ని విష యములకు ఇట్లే చూడవలయును ఇది సులభోపాయము.

20-10-82 నుండి 4-11-82కు 15దినములుగాన 8వ భాగాలో గ్రహము ప్రవేశించినది. గ్రహములకు కాలము ఎక్కువ తక్కువలు వచ్చుచుండను, గమనించవలయును. ఒక్కొక్క లగ్నములో ద్వాదశ భావములు గలవు గాన గ్రహము ఎన్నవ భాగలో వున్నదో తెలుసుకొనుట శ్రియము.

శ్రీ— స్వామి, గృహములు, భూములు, స్థలములు మొదలగు స్థిరాస్తికు తగాదాలు పడి కోర్టు కెక్కెదరు. వారి జాత కము లెట్లుండును.

గు— వత్సా, చతుర్ధ దశమములలో శుభా శుభులున్న యెడల తగాదా గలవి లభించును తగాదాలు పెరిగి, కడకు కోర్టు కెక్కుదురు. శుభ గ్రహము బలముగా నుండిన యజమాని పరమగును. లేదా పాపగ్రిహము బలముగా నుండిన తగాదా పెట్టినవారి పరమగును. ఏకనక్షత్రిముపై రెండుగ్రహము లుండిన వెనుకనున్న గ్రహము శుభుడైన యజమాని పర మగును. పాపగ్రిహము వెనుక నుండిన శత్రివు పరమగును అనగా ఏక నక్షత్రిములో శుభుడు 1, 2 పాదములందు పాపగ్రిహము 3, 4 పాదము లందుండిన గృహస్తునికే దక్కును. లేకపాప గ్రిహము వెనుక భాగము నందుండిన ఎదుటువారి పక్షమే గెలుచును, చతుర్థమున శుభులుండిన తగాదాలే రావు. వ్యవహారము పెట్టువారే వుండరు. గోచార రీత్యా అయినా ఇదే విధముగా చూడవలయును. పాప

గ్రహము బలముగా చతుర్థ మందుండిన కొంపే నిలవదు. స్థిరాస్తులు ధన బలముండి కొన్నను, తప్పక దుఃఖపెట్టును.

శ్రీ— రాహువు, కేతువు ఏ ఉద్యోగము ఎటువంటి చదువు గల్పింతురు.

గు— వత్సా, ఏ గ్రహముగాని తానుండ బడినవాని గ్రహ కారకత్వము లేవో అని తతుస్థింప చేయును. రాహు కేతువులకు స్వగృహములు లేపుగావున ఏగృహము నందుందురో ఆ ఇంటి వానిబలమే చేకూర్తురు. రాహువు శుభుడై సింహ కటకము లందుండిన ప్రభుత్వోద్యోగము నిచ్చును. కేతువు అంతే యిచ్చును. ఏ గ్రహమైనను తానున్న వాని గృహ కారకత్వములనే యిచ్చును స్వక్షేత్ర మందుండిన, వాని కారకత్వములనే యిచ్చును. గురు పాలిత లగ్నములకు రాహువు లగ్న సప్తములోను లగ్న ద్వితీయములోను రాహు కేతువులున్న ద్వికళత్ర యోగముండును రాహువు లగ్న ద్వితీయములో నుండవలయును.రాహువు చూపు సప్తమాష్టములలో నుండ వలయును శని పాలితులకు కేతువు లగ్న ద్వితీయములలో నుండవలయును. అటు గాక పోయిన ఒక స్త్రీని చాకుట తప్పదు.

శ్రీ— స్వామి, గురు పాలిత లగ్నములకు గురువు శుక్రని చూడవలయును, లేదా, కుజ, రవి, చంద్రులు చూడవలయును శని పాలిత లగ్నములకు శని చూడవలయును. శుక్రని అన్నారు నిశ్చయమేనందుర.

గు— వత్సా, అది నిశ్చయమేయగును. సప్త మాష్టమములలో లగ్న పంచమ నవమాధిపతులలో నొకరైన లేక పోయిన, వివాహమగుటు కష్టము కాదని అయిన చిక్కులు చిద్రములు గలుగును.

శ్రీ— స్వామి, బంధువులున్న గ్రామముననే వివాహమగునని చెప్పితిరే ఎట్లు ఏ గ్రహమువల్ల,

గు— వత్సా, చతుర్థములో గాని, దశమములోగాని, శుభగ్రహముండి నను చూచినను బంధువులున్న చోటనే వివాహమగును. పంచమములోగాని ఏకా దశమములో గాని శుభులుండిన, స్వగ్రామముననే వివాహమగును. సప్తమములో బలముగా శుభులున్న బంధువర్గములోనే వివాహమగును. శుక్రుడున్న అత్తకూతురు బుధుడున్న మామకూతురు కుజుడున్న అక్క కూతురు కాగలదు.

శ్రీ— స్వామి, స్థలమహాత్యం అంటూ వుంటారు. స్థలములో మహత్తు అని ఒకటుండునా!

గు— ఔను, ఖగోళము నుండి నవగ్రహ కిరణములు ఈ భూమిపై పడుచుండును. గురు జాతకునకు శని, బుధ, శుక్ర రాహు గ్రహ కిరణములు పడుచోట్లు లభించిన చెడ్డ చేయును. శని జాతకునికి గురు. కుజ, రవి, చంద్ర కేతు గ్రహ కిరణములు పడు స్థలములు కీడు చేయును ఏ జాతకునికి ఆయా జాతక గ్రహ కిరణములు పడుచోట్లు లభించుట పూర్వ పుణ్య ఫల ముండవలయును. గురు జాతకునకు లగ్నపంచమ నవమాధి పతులలో నొక గ్రహముండిన, శుభస్కరము, ఉదా : మేష లగ్నమునకు నవమాధిపతి గురువు చతుర్థ మందు బలవం తుడై యుండిన ఆ స్థలములో గృహము కట్టిన తరములుగా నుండును. దేవాలయములు కట్టిన విష్ణు పర్యాయముగా తరతరాలుగానుండును అట్టిది లభించుట మహాకష్టము. ఆ స్థలమును ఆ స్థలములోగల భవనముల చూచినవారు ఆ స్థలమహాత్య మనెదరు

శని పాలిత లగ్నములలో తులా లగ్నమునకు చంద్ర, శని, బుధ, రాహు గ్రహములలో నొక గ్రహము చతుర్థ మందుం

డిన గృహము, భావి, కోనేరు మొదలగు స్థిరాస్తులు చాలా కాలముండును. వీటిని స్థలమహాత్యనుందురు. అట్టి జాతకు దేవాలయములు శివపరముగా నుండవలయును. అదే జాతకుడు అట్టి స్థలములో విష్ణు పర్యాయముగా దేవాలయములు కట్టిన కొలది కాలముననే నిధిలమగును - ఉ॥ మేష, సింహ, ధనస్సులు మూడింటికి చతుర్థమున నవమ, పంచమ, లగ్నాధిపతులుండి పాపగ్రహ వీక్షణ లేకున్న స్థాపిత నిర్మాణములు చెడని పదార్థములుగా నుండును. వృషభ, మిధున తుల, కుంభములకు చతుర్థ శుద్ధి గలదు, శని పాలితలగ్నములకు ప్రబలయోగము. స్థాపిత నిర్మాణములు చేసిన చెడని పదార్థము లగును

శ్రీ— స్వామి, నీ గృహము మహాడీ కాగలదని చెప్పితిరే, ఏ గ్రహామువల్ల,

గు— వత్సా, రవి, చంద్రులు, చతుర్థ దశమ ద్వితీయములందుండిన, మేడను సృష్టింతురు. కుజుడు చతుర్థ దశమము లందు శుభుడై యుండిన ముందుగాని వెనుకగాని ముందు వెనుకలగాని, స్థలముండి చెట్లు చేమలుండును. శని యుండిన కక్కసుదిబ్బ మొదలగు నీచములుండును, చంద్రునివల్ల భావి సృష్టింపనగును. లగ్నపంచమ నవమాధిపతులు చంద్రుని చూచిన భావిని సృష్టింతురు. ఎన్ని గ్రహాములు చంద్రుని చూచునో అన్ని భావుల త్రవ్వ కొనునట్లు జరుగును.

శ్రీ— స్వామి, ఒక్కరికి మంచివారుగా విలువ గలవారుగా చెప్పకొన తగువారుగా చిక్కులలో ఆదుకొనువారుగా బంధుమిత్రులుందురని కొందరికి చెప్పితిరి_కొందరికి బంధుమిత్రులనమ్మిన సర్వాత్రా చెరతురు. సర్వము నశింపగును. స్థిరా

స్తులు దగ్గర కలహములు సంప్రాప్తించును. అని చెప్పితిరే ఏ గ్రహమువల్ల,

గు— వత్సా, చతుర్థస్థానము బ్రహస్థానము అందులో నవమాధిపతి వుండిన సర్వము శుభస్కరముగా నుండును. పంచమాధిపతి వుండిన విద్యాధికులు బంధు మిత్రులై బలము చేకూర్తును. కాగల కార్యములన్నీ చేసి పెట్టుదురు. నవమాధిపతి వుండిన ధనికులు బలవంతులుగా నుండి సహాకరింతురు, అదే నాలుగింటిలో తృతీయ షట్ స్థాన, అష్టమ ద్వాదశాధిపతులుండిన బంధు మిత్రులే శత్రువు లగుదురు. దూర గ్రస్తులగుదురు. ఒక్కరుకూడ లేకుండా పోవుదురు, శత్రువుల పక్షమున చేరుదురు. ఇంటికివచ్చి చేచిక్కినవి, సంగ్రహింతురు. అపనిందల పాలు చేయుదురు అపనిందలు వచ్చును-షట్ స్థానాధిపతి చతుర్థ మందుండిన బంధుమిత్రులు రోగగ్రస్తులై పోదై పోదురు, అష్టమాదిపతి యుండిన కష్టములపాలై చెల్లా చెదురైపోదురు కష్టములతో, అందరు నశింతురు. చతుర్థ దశమము లందు లగ్న, పంచమ, నవమస్థానాదిపతులున్న వారు పూర్వ పుణ్యులు చతుర్థ దశమములందు, తృతీయ షట్, అష్టమ, ద్వాదశ స్థానాదిపతులున్న వారు పూర్వపాపులు,

శ్రీ— స్వామి, కన్యకు, వరుడు వరునికి కన్య, మీ బందువులున్న చోటనే వుందురని చెప్పుచున్నారే, ఏ, ఏ గ్రహములవల్ల,

గు. వత్సా, లగ్న పంచమ నవమాదిపతులు, చతుర్థమును, చూచినను వుండినను కన్యకు వరుడు వరునికి వదువు లభింతురు, ఇది వారి పుణ్యము లేక సప్తమాష్టమములలో శుభ గ్రహములున్న, బందువులలో వరునికి కన్య, కన్యకు, వరుడు, లభించును.

శ్రీ- ఆ పిల్లవాని క్రింద, పలానారంగు వస్త్రమున్నదని, చెప్పి

తిరే ఎట్లు.

గు- వత్సా, చతుర్థము వస్త్రస్థానము ఆ స్థానము, గురువు చూచిన పసుపురంగు, కుజుడు ఎఱుపు బుదుడు చిలుకపచ్చ శని నలుపు, సూర్యుడు గోదుమవన్నె' చంద్ర శుక్రులు తెలుపు, రాహువు పొగరంగు, కేతువు, చీటీ రంగులు, ఆ పిల్లవాని క్రింద నుండును. శుభ గ్రహ రంగులుండిన మంచిది. పాప గ్రహ రంగులుండిన మంచిది గాదు, తీసివేసి శుభ గ్రహ రంగులు వేయుట శ్రేయము.

శ్రీ- స్వామి, మిషన్, అంగడి, బండి మొదలగునవి వేయునప్పుడు నీ ప్రక్కన మరోకరు వేయుదురు. అందువల్ల నీకు అర్ధ లాభమే వుండునన్నారే, ఏ గ్రహమును బట్టి చెప్పెదరు.

గు- వత్సా, దశమ చతుర్థములందు పాపగ్రహములున్న యడల, గ్రామస్థులు అసూయా పరులై, ప్రక్కనే అట్టివి నియమింతురు. లేదా వేరోకటి, ఉన్న చోటనే వీరు ప్రయత్నింతురు పాపగ్రహము లిట్లు చేయును, శుభ గ్రహములున్న ఎదురు లేక నడచి గొప్పలాభము గడింపనగును, ప్రతిదీ, ఇట్లే వుండును. పాపులు చింతింప చేయుదురు. శుభులు సంతోషింప చేయుదురు.

శ్రీ- స్వామి, భూమిలో ఉత్తరపు దిశన పుట్టలున్నాయని చెప్పితిరే ఆ దిశను, ఎట్లు తెలుసుకొనవలయునందురు,

గు- వత్సా, రాహు కేతువులకు స్వక్షేత్రములు లేవు. ఏ దిశాదిపతి గృహములో రాహు వుండునో ఆ భూమిలో ఆ దిశన, పుట్టలు, చెదులు, గరిక వుండును. రాహు కేతువులకు స్వగృహములు లేనందున ఏ యింటిలో వుందురో ఆ యింటి ఫలమునే యిచ్చు చుందురు. ఆ స్థలములోగాని యింటిలోగాని క్రిమి కీటకములు ఎక్కువగా

నుండును. సర్పములు కూడా వుండును.

శ్రీ- భూమికి నీటికి సంబధమున్నట్లు కుజ చంద్రులకు మిత్రత్వ మున్నట్లేనందురు.

గు- వత్సా, భూమికి అదిపతి కుజుడు, నీటికి అదిపతి చంద్రుడు, శుభులై ఇరువురు ఒక చోటవుండిన శ్రేష్ఠమైన భూమి సమృద్ధిగా జలము వుండును కోరిన పంటలు పండును. వర్షము వచ్చిన భూమిపై సకల ఓషదులు, మొలకెత్తినట్లు కుజ చంద్రులు శుభులై కలసి యుండు జాతకులు పూర్వ పుణ్యాలు కావలసినంత ఫలముండును.

శ్రీ- స్వామి, ఇంటికి నూరేండ్లు దాటిన ఆయువు తీరుననియు మళ్ళి ఎక్కడనో ఒక మూల క్రొత్త చేయుట మంచిదను చున్నారే వాస్తవమే నందురు.

గు- వత్సా, మానవులకు అరవై యేడులకు, షష్టి పూర్తి చేసుకొన్నట్లు గృహమునకు నూరేడులకు క్రొత్తది చేయవలయుననుట, ఈ రెండు పురాణోక్తములు, శాస్త్రోక్తములుగావు తాను పుట్టినవుడు ఏ లగ్నమున శని వుండునో ఆ లగ్నమును విడచి, ద్వాదశ లగ్నములు దాటి వున్న చోటికి వచ్చుటకు ముప్పయియేడులు పట్టును. అట్లు రెండుమార్లు శని తిరిగిన అరవైయేడులగును, ముప్పయి యేడులలో ఒక సారి చంపక విడిచినాడని రెండవ దపా విడిచినాడని అకాల మృత్యువులు, ఎమి చేయలేదని బ్రతికి గడ్డకెక్కినామని షష్టి పూర్తి చేసుకొనుచున్నారు. గృహము నూరేడులలోపల ఏ చిక్కు ఛిద్రము లేకుండ వుండినదని కొంచెము క్రొత్త చేసిన బాగుండునని ఆనాడు, బంధుమిత్రుల పిలుచుకొని విందులు వినోదములు చేసుకొందురు దేవాలయములకు పోయి, పూజలు చేయించుకొందురు, ఇంతేకాని చేసియే

తీరవలెనను, శాస్త్రములేదు. ధనికులు ఈలాంటివన్నీ ఆచరింతురు. తెలియనివారు బీదవారు చేయలేరు.

శ్రీ— నూతన గృహ ప్రవేశమునాడు నవగ్రహ జపములు, నవగ్రహ హోమములు చేయుట మత్స్యయంత్రము కూర్మయంత్రము వాసుదేవ యంత్రము, వేయుట శీతలా యంత్రము వేయుట చేయుచున్నారే శుభ మందురా ఆ శుభమందురా,

గు— నూతన గృహ ప్రవేశము చేయునపుడు పాప గ్రహములకు దానము, శుభగ్రహములకు పూజలుచేయించి ఆ గృహస్థుడు గురు పాలితుడో, శని పాలితుడో తెలుసుకొనియే పాప గ్రహముల నిర్ణయించినావుగద. శుభగ్రహములు విష్ణు అంశయో, శివాంశయో తెలుసుకొన్నావుగద శుభ గ్రహాదిపతి సహస్ర నామ పారాయణము చేయించుట శ్రేయోదాయకము గాని నవగ్రహ జపములు నవగ్రహము హోమము చేయుట యంత్రములు వేయుట అష్ట దిగ్బంధన చేయించుట గృహమునకు అనిష్ట అనియే జోస్యము చెప్పను– త్రిమూర్తుల త్రిదేవుల పూజా మందిరములో పెట్టుకొని నిత్యము పూజించుట గృహమునకు గృహస్తునికి, ఎంతో శ్రేయము, ఆహారము పెట్టక పూజ చేయరాదు. పాప భూయిష్టులగుదురు.

శ్రీ— స్వామి, ఉదాహరణకు, లగ్నపంచమ నవమాదిపతుల బలము గల జాతక మొకటి తెలుపుడు.

గు— వత్సా, మేష లగ్నమునకు ఒక జాతకునకు గ్రహము ఎట్లున్నప్పుడు జననమైనాడు చూడుము.

| | | | |
|---|---|---|---|
| చ ర | ల | గు | |
| బు శు | | | |
| కు | | | |
| | | శ | |

లగ్నాదిపతి కుజుడు దశమమున ఉచ్చ స్థితుడై యుండెను. లగ్న చతుర్థ పంచముల చూచెను. మూడు స్థానములు, రాజ్య స్థానములు ఉన్నది ఉద్యోగ స్థానము ఈ జాతకుడుకు గ్రామీణుమగు స్వగ్రామము విడచి పట్టణ మందు చేరి విద్య నభ్యసించెను. జననము గురు దశ అందువల్ల శని దశ బుధ దశలో స్వభుక్తి పోయినంతవరకు కృషీవలుడు శని బుదులు విడచిన తోడనే కుజుడు కావలసినంత వసతులతో విద్యనభ్యసింప వీలు గలిగించెను. ఉద్యోగము చేయుటకు యిప్పించుటకు వీలు గలిగించెను కవిగా మార్చెను చతుర్ధ పంచమ స్థానాదిపతులు ద్వాదశమమున నుండిరి, గాన మరింత బలము చేకూరెను నవమాదిపతి ద్వితీయమందు బలముగా నుండెను. ఇట్లు గ్రహములు శుభస్థితిలో నుండి దశానుకూలత గలుగుటవల్ల, కావ్యముల వ్రాయగలిగెను. కుజ దశలో వృత్తి ఉద్యోగ వ్యాపార గౌరవ ప్రతిష్ట పొంద గలిగెను. గృహములు గృహోపకరణములు దండిగా సంపా

డించెను. గ్రంధ శోధన చేయుటకు విరామకాలము నొస
గెను. ఖ్యాతిని గడింపచేసును.

శ్రీ- అష్టమాదిపతి బలముగా పంచమములో నున్న తల్లికి పుట్టిన పిల్లలంతా పుట్టినతోడనే చనిపోవు చుండురు. కుజుడు చంద్రుడు పాపియై యుండి పంచమములో పాపగ్రహమున్న గర్భ స్రావములు కలుగుచుండును.

గు- కుజ చంద్రులవలన ద్వాదశములోనున్న పాప గ్రహముల వలన పడిశము భేదులువలన అమ్మవారివలన కొలదినెలలకు సంవత్సరములకు వీరి భుక్తులవలన చని పోవుచుందురు. పుట్టినవానికి ద్వితీయాష్టమములలో శుభగ్రహమున్న రోగులై కడకు బ్రతుకుదురు. అష్టమమును చక్కగా పరికించవలెను. ఆయుర్దాయములో 3 భాగలు 25 నిడులలోపల అధమాయుర్దాయము 50 వరకు మధ్య ఆయుర్దాయము 50 నుండి సంపూర్ణాయుర్దాయము అష్టమములోనున్న పాపగ్రహము ఎంత బలముగా నున్నదో గ్రహించి ఈ మూడు విధముల గ్రహించవలయును. ఇందులో శని జాతకులకు ఆయుర్దాయము ఎక్కువ గురు జాతకులకు తక్కువ దీనిని గమనించ వలయును.

ఉరి వేసుకొనుటకు కుజుడు కారకుడు-నీటిలో పడిచచ్చుటకు చంద్రుడు కారకుడు. నీటి గండము-కాల్చుకొనుటకు కారకుడు సూర్యుడు కౌమారదశ-అష్టమాదిపతి-చతుర్థమున ప్రబలముగా నుండిన షట్ స్థానమున పాపగ్రహమున్న శత్రువులతో పొడవబడుట చచ్చుట తటస్థించును శుక్రుడు పాపియై చతుర్థమున పాపగ్రహమున్నను శుక్రుడే ఉన్ననూ వాహన గండము గలుగును ఈ గ్రహములు పాపగ్రహములై శుభగ్రహవీక్షణ లేకున్న చావు నీటిలో సంభవించును ఒక వ్యక్తి ఇంటి నుండి వెళ్ళి పోయినవాడు నివసించు

గ్రామము తెలుసుకొనుట మహాకష్టము. చంద్రుడు పాపియై వెళ్ళి పోయిన స్థలము తటాకతీరము సముద్ర తీరము నదీ తీరము నీటి పారుదల గల స్థలముగా నుండును. కుజుడు పాపియైన కొండలు గుహలుగల స్థలముగా నుండును. చతుర్థమును ఏ గ్రహము చూచునో వుండునో ఆ దిశకు పోవును గురువు చూచిన విష్ణు పర్యాయ తీర్థ స్థలములో నుండును. శని చతుర్థమున నుండిన మఠములలో ఆశ్రమములలో సన్యాసులతో నుండును. బుధుడుండిన వ్యాపార స్థానములను పట్టణములలో నుండును. శుక్రుడుండిన వాహనములు రిపేరీ చేయుచోట్లు హోటళ్ళు గల స్థలములలో నుండును. సూర్యుడుండిన పట్టణములలో నీచవృత్తితో జీవించు వారి చెంత నుండును. చతుర్థమును పాపులు చూచిన వెళ్ళి పోవును. తిరిగి ఆ స్థలమునకు శుభగ్రహము వచ్చినప్పుడు ఇల్లు చేరును. చతుర్థదశమములలో ఎన్ని గ్రహములుండునో అన్ని సార్లు పోవును. శుభగ్రహవీక్షణ చతుర్థమునకు లేకున్న స్వస్థలము మరచియే పోవును-ఆ గ్రహదశపోయిన వచ్చెడి వారు గలరు. జీవించుటకు అష్టమములో శుభ గ్రహముండ వలయును. పశువులు గాని మనుష్యులుగాని చతుర్థమును ఏ దిశాధిపతి చూచునో ఆ దిశకు గాని స్థానాదిపతి దిశకుగాని పోవును. ఇన్ని మైళ్ళనిగాని ఫలానా ఊరనిగాని ఫలాని వాని ఇంటిలోననిగాని చెప్పుటకు దారులు కానరాలేదు. చెప్పువారులేరు. అట్లు జోస్యుడు చెప్పిన బ్రహ్మ వ్రాతను తప్పించిన వాడగును. లక్షలు సంపాదించవచ్చును ఇది కానిపని. కుజుడు కుజక్షేత్రములు పాపత్వము చెంది యుండిన కాళ్ళ చేతులలో లోపములు గలుగును. శని శని గృహములు రెండు పాపత్వము చెందిన ఆహార కోశములో

గుదస్థానములో మల విసర్జనలో, కడుపులో, లోటుకలుగును. సూర్యుడు సూర్యక్షేత్రము పాపత్వము చెందిన కన్నులలో కలుగును. చంద్రుడు చంద్రక్షేత్రము పాపత్వము చెందిన రలలో నాలుకలో శబ్దములో లోటు కలుగును బుధుడు బుధ క్షేత్రములు పాపత్వము చెందిన వెన్నెముక తొడలు-నడుములు, గిరిగిలు పిరుదల లోటు గలుగును. గూనినడ్డివచ్చును శుక్రుడు శుక్ర క్షేత్రములు పాపత్వము చెందిన పొత్తికడుపు వృషణములు మేఢ్రములో లోటు కలుగును. గురువు గురు క్షేత్రములు పాపత్వము చెందిన వక్ష స్థలములోపల గుండె శ్వాస కోశములలో లోటు కలుగును. మూడు స్థానములలో ఒకటైన మిగిలి ఉండిన కొంతనయముగా ఉండును. మాతృ స్థానము 4 మాతృ కారకుడు చంద్రుడు బాగుండిన తల్లికి ఆరోగ్యముండును. రెండు చెడిపోయిన మాతృ స్థానమునకు అష్టమములో పాపగ్రహముండిన తల్లి గలించుటో రోగ గ్రస్త యగుటో తప్పదు.

శ్రీ— తండ్రికి గండము - ఎట్లుండును - లేదనుకెట్లు దీర్ఘాయువు గలుగునెట్లు-

గు— పితృస్థానము తొమ్మిది పితృ కారకుడు సూర్యుడు రెండూ పాపత్వము చెందిన గండము ఆయా భుక్తులలో గండము రెండూ శుభముగా నుండిన తండ్రికి గండము లుండవు. తొమ్మిదిలో నొక శుభగ్రహముండి సూర్యుడు శుభగ్రహముతో చేరిగాని చూడబడిగాని వుండిన దీర్ఘాయువు గలుగును. తల్లికి కూడా స్థానము కారకుడు శుభముగా నుండిన దీర్ఘాయువు గలుగును.

శ్రీ— పుట్టిన పిల్లవానికి గండములు ఆయుర్దాయములు తెలునుకొనుటెట్లు.

గు— జాతకునికి లగ్న లగ్న ద్వితీయ సప్తమ అష్టమములలో శుభ గ్రహము లుండిన దీర్ఘాయువు గలుగును. పాప గ్రహము లుండిన ప్రథమాయుర్దాయము కలుగును. ఆ గ్రహ కారకత్వములలో నశించును.

శ్రీ— ప్రభుత్వము ద్వారా విదేశమునకు పోయి చదువుకొని వచ్చి ప్రభుత్వములో చేరుతారు. ఏ గ్రహ బలము వలన?

గు— ప్రభుత్వ గ్రహములు రవి చంద్ర కుజులు, వీరి స్థానములు రవి చంద్రులు బలముగా నుండి అనగా పంచమ చతుర్థ దశమములో ఈ గ్రహములుండి దశానుకూలత గ్రహానుకూలత కలిగిఉండిన అట్టి అదృష్టము లభించును

శ్రీ— సొంత ఖర్చుతో విదేశ ప్రయాణము చేసి చదివి వస్తారు. ఏ గ్రహ బలము వలన.

గు— తొమ్మిదింట శుభ గ్రహమున్న ధన బలము కలుగును. సూర్య చంద్ర బలము తక్కువగా నుండును. అట్టి జాతకులు స్వధనముతో పోయివత్తురు

శ్రీ— కొందరు ధనాశతో విదేశ ప్రయాణము చేసి సంపాదించుకొని తిరిగి వస్తారు. వీరి గ్రహము లెట్లుండును.

గు— తొమ్మిది పదింటి విదేశ గ్రహములగు చంద్ర రవి కుజ గ్రహములుండినవారు విదేశ ప్రయాణములు చేసి సంపాదించుకొని వత్తురు, శని పాలతి జాతకులైన కటక సింహ మేష వృశ్చికములలో లగ్న పంచమ నవమాధిపతులుండుట గాని ఆ లగ్నాధిపతులను శుభ గ్రహములు చూచుటగాని ఉండును.

శ్రీ— వెటర్నరి డాక్టరు కోర్సు చదువుకొనువారికి గ్రహము లెట్లుండును.

గు— పశు కారకత్వము శుక్రునికి కలదు. శుక్ర గ్రహము

చక్కగా బలముగా నుండి బుధ గ్రహము బలముగా లేకున్న వారు పశువుల వైద్యము నేర్చుకొందురు. డాక్టర్లకు బుధుడు బలముగా నుండును. బుధ గృహములు శుభముగా నుండును. అవి పాపత్వము చెందుటవల్ల సీటు దొరకకనో బుద్ధి బలము చాలకనో పశువుల డాక్టరుగా మారును.

శ్రీ- పాలిటెక్నిక్ కోర్సు చదువుకొను వారికి గ్రహము లెట్లుండును.

గు- ఈ కోర్సు చదువుటకు బుధుడు బుధుని గృహములు రెండు శుభ స్థితిలో నుండిన వారికి సులభోపాయముగా నుండును.

శ్రీ- కొందరికి ప్రతి దినమును దుస్వప్నములు వచ్చుచుండును. కొందరికి మంచి స్వప్నముల వచ్చుచుండును. కారణమే మందురు.

గు- లగ్న సప్తమమున చెడ్డ గ్రహము లుండినను గోచార రీత్యా వచ్చినను దుస్వప్నములువచ్చును. శుభగ్రహము లుండినను గోచారరీత్యావచ్చినను మంచిస్వప్నములు వచ్చుచుండును.

శ్రీ- వాహనము కొనుగోలు చేయునపుడు నాకు ఏ నంబరు బాగుండునందురు. ఏమని చెప్పవలయును.

గు- గురు పాలిత లగ్నముల వారికి బేసి సంఖ్య శని పాలిత లగ్నముల వారికి సరి సంఖ్య శ్రేయస్కరము.

శ్రీ- వరలక్ష్మి, పూజా విధానము ఏ విధముగా చేయ వలయును.

గు- లక్ష్మీ సహస్రనామముగాని అష్టోత్తరముగాని చెప్పి తిరుపతి తీర్థయాత్రలో చెప్పుకొను పద్యములు చెప్పి నైవేద్యము చేయుట శ్రేయోదాయకము.

శ్రీ- స్వామి, దైవధ్యానము చేయుటకు, ఉత్తరమునకు మేలని, పశ్చిమమునకు మేలని, లేదు తూర్పు దిశాభి ముఖముగా కూర్చొని ధ్యానించుట మంచిదని కొందరు, దక్షిణమునకు

మళ్ళి ధ్యానించ రాదని కొందరు అంటారు. ఏ దిశకు మళ్ళి కూరుచొనవలయునో తెలుపుడు.

గు- వత్సా, పలువురు పలు విధముల చెప్పుదురు. హిందువులు తూర్పు ముఖముగా కూర్చొనుటకు కారణము, సూర్యుడు తూర్పు దిశన ఉదయించును. సూర్యుడు, హిందువులకు ముఖ్యదైవము గాబట్టి తూర్పు ముఖముగా కూర్చొని ధ్యానింతురు. బ్రాహ్మణులు సాయంత్రము పశ్చిమమునకు మళ్ళి అర్ఘ్యము విడుచుదురు, సాయంత్రము సూర్యుడు పశ్చిమమున నున్నాడని వారి భావము, మహమ్మదీయులు పశ్చిమమునకే మళ్ళి ఉదయి సాయంత్రముల ధ్యానింతురు. ఇది మత వైషమ్యము దైవము సర్వతో ముఖుడుగాన వీలు గలిగిన దిశకు మళ్ళి ధ్యానము చేయవచ్చును. విష్ణు పరముగా తూర్పు దక్షిణము శ్రేయము-శివ పరముగా పరమునకు ఉత్తరమునకు శ్రేయము. ఇంద్రుడు, సూర్యుడు అధిపతులు తూర్పునకు-యముడు కుజుడు అధిపతులు దక్షిణమునకు గాన ఇవి, విష్ణు పరములు-పశ్చిమమునకు శని వరుణుడు అధిపతులు ఉత్తరమునకు బుధుడు-కుబేరుడు అధిపతులు గాన ఇవి శివ పరములు. ధ్యానాధిష్ట దేవుడు ఏ దిశకు అధిపతియో తెలుసుకొని కూరుచుండుట శ్రేయము-

శ్రీ- స్వామి! కొందరు కరెంటు షాక్ కొట్టి, కొందరు కాల్చుకొని, కొందరు గ్యాస్ మంటవల్ల చనిపోవుదురు. కొందరి ఇండ్లు కాలిపోతాయి. వారికి ఏ గ్రహములు పాప గ్రహములు ఇట్లు తటస్థించును.

గు- వత్సా! అగ్నికి కారకులు రవి, శుక్ర, కుజ గ్రహములు వీరు అష్టమాధిపతులై, అష్టమములో నుండిగాని, చతుర్థ దశమములందు వుండిగాని వుండి కుటుంబ కలహములందు పడలేక

ముక్కోపమువల్ల కాల్చుకుందురు చతుర్థమందున్న, పొరపాటున కాలి చత్తురు. శుభ గ్రహ వీక్షణ గలిగిన నారి బ్రతుకుదురు. చతుర్థ దశమము లందు బలముగా నుండిన గృహము కాలిపోవును. అష్టమ షట్ స్థానాధిపతులు కలిసి చతుర్థ దశమము లందుండిన, శత్రువులు కాల్చుదురు.

శ్రీ- స్వామి! కొందరు రైలుక్రింద పడి చనిపోతారు? ఏ గ్రహము వల్ల. కొందరు భార్యలు భర్తకు విషము పెట్టి చంపుతారు? కొందరు భార్యలకు విషము పెట్టి చంపుతారు - కొందరు ఇంటి గొడవలతో చనిపోతారు ఏ గ్రహ పీడవల్ల

గు- వత్సా! శుక్రుడు వాహన కారకుడు స్త్రీలకు కారకుడు, గాన శుక్రుడు పాపియై లగ్న ద్వితీయాష్టమ, చతుర్థ దశమము లందు శుభ గ్రహ వీక్షణ లేకుండా వుండిన స్త్రీలవల్ల చిక్కు లేర్పడిగాని, యౌవనము లేక గాని అవమానము సహించలేక పడుచుందురు. భర్తకు భార్య-భార్యకు భర్త సరి పోక చాపుకు తెగించుటకు కారకులు శుక్ర, కుజులు, వీరితో చంద్రుడు కలిసిన ఇట్టి విపరీతపు బుద్ధి కలుగును విషమునకు కారకుడు చంద్రుడు, దీనికి కారణము వ్యభిచారము, ఇంటి గొడవలకు కారణము, యజమానికి రెండవ వివాహము, తల్లిలేని పిల్లలు చాకుట, వ్యభిచారము మూలముగా నుండి నిరాశతో ఎటు పోవుటకు వీలులేక చనిపోవుదురు. దుర్మరణము సంభవించును.

శ్రీ- కొందరు విషము, విషముతో నిండిన రసాయన క్రిమి సంహారక మందులు, నిద్ర మాత్రలు మొదలగు విషములు త్రాగి చని పోవుదురు? కారణ మేమందురు?

గు- భార్య భర్తలకు సరిపోక సుఖము లేదని గృహచ్ఛిద్రముల వల్ల జీవితముపై నిరాశ చెంది, శత్రు, ఋణ రోగ విపత్తు

లతో భాధ భరించ లేక చనిపోతారు. వీరికి ద్వితీయ, సప్తమ లగ్న అష్టమ, ద్వాదశ, షట్ స్థానములలో చంద్రుడు పాపియై యుండిన, అట్టి వస్తువులు లభింపచేయును. దుర్మ రణములకు బుద్ధి పుట్టును. పురుషుడైన దేశాంతర గతుడగును ఆ చంద్రునికి శుభ గ్రహ వక్షణ యుండిన తిరిగి బ్రతుకు దురు. చంద్రుడు హాలా హలమునకు - అమృతమునకు విహారభూమి గాన విషము చంద్రుని కారకత్వము.

శ్రీ- స్వామి! కొందరు తల్లిదండ్రుల బిడ్డలకు విషము పెట్టి చంపుదురు. కారణ మేమందురు.

గు- వత్సా! పంచమములో ప్రబలముగా నొక పాపగ్రహముండి దశమములో సూర్యుడు పాపియైయున్న తండ్రి తనకీ సంతతి పుట్టలేదని సంకోచించి భార్యకు తెలియకుండా చంపి పాపము గట్టుకొనును-భర్తతో కలహించుకొని ఈతని వం శమే నిలువ కూడదని రోషముతో పిల్లల చంపును. ఆయిన జాతకములో పంచమములో ప్రబలముగా పాపగ్రహము, దశమములో చంద్రుడు పాపియై యుండును. ఈ రెండు గ్రహములకు శుభ గ్రహ వీక్షణ గలిగి యుండిన పిల్లలు గండము గడిచి బ్రతుకుదురు.

శ్రీ- కొందరు, ఇల్లు కూలిపడి, మాను విఱిగిపడి, మానుయెక్కి జాఱిపడి మిద్దె పైకెక్కి పొరపాటుతో జారిపడి చనిపోతారు. ఏ గ్రహము ఎక్కుడుండి, ఇట్టి ఆగంతుక మృత్యువులు తటస్థించునందురు?

గు- అట్టి జాతకములకు, కుజుడు పాపిగా నుండును. చతుర్థ దశమముల నుండినను లేక షష్ఠాముముల యందు లగ్న ద్వితీయములందు వుండినను ఇట్టివి తటస్థించును. అ కుజుని శుభ గ్రహము చూచినను, జాతకునికి కాలుగాని చేయిగాని

దెబ్బలు తగిలి బాధ కొంతకాలము పడవలసి వుండును. శుభ గ్రహ వీక్షణ లేకున్నను దుర్మరణము చెంద వలసి వుండినను కుజుడు ఎత్తు నుండి పడద్రోయును, ఒకరి వేసు కొను బుద్ధిని పుట్టించును ఆ కుజునితో షట్ స్థానాధిపతి కలిసి వుండిన శత్రువులు కాళ్ళు చేతులు నరికి వేయుదురు. దీనికి చతుర్థములో పాప గ్రహముగాని అష్టమాధిపతిగాని తోడుండవలయును.

శ్రీ- కొందరు ఆస్పత్రిలో ఆపరేషన్ చేస్తుండగా చనిపోతారు. కొందరు బ్రతికి బయటపడతారు. కారణమేమై యుండ వచ్చును?

గు- పంచమములో ప్రబలముగా పాప గ్రహమున్న స్త్రీలుగాని పురుషులుగాని, అసురీ చికిత్స పొందుటకు ఆసుపత్రి పోవ లసి వచ్చును. అష్టమాదిపతి పంచమమును చూచినవారు గతించెదరు తృతీయ షట్ స్థాన, ద్వాదశ స్థాన, అధి పతులు పంచమమును చూచిన కష్టపడి బ్రతుకుతారు. వీరికి శుభ గ్రహ వీక్షణ గల్గిన చంపలేరు. కష్ట పడుదురు. [అసురీ అనగా ఆపరేషన్ చేయుట.]

శ్రీ- కొందరు విమానములో పోతు విమానము కూలి చనిపోతారు కారణమేమందురు.

గు- దీనికి కారణము జాతకునకు చంద్రుడు అష్టమాదిపతియై చతుర్థ దశమములో నుండి అదే భుక్తిలో నుండిగాని పాపియై యున్న చంద్రునితో అష్టమాదిపతి కూడి చతుర్థ దశమము ఇట్టి ఆగంతుక మృత్యువు తటస్థించును.

శ్రీ- స్వామి, కొందరు పడవ మునిగి చనిపోతారు. కొందరు తల్లులు పిల్లల బావిలో వేసి తాము పడి చనిపోతారు. దేని వల్ల ఏ గ్రహముల వల్లనందురు.

గు- వత్సా గృహచ్ఛిద్రములతో ముక్కోపులై సుఖము లేదు ఇక రాదు ఎందుకు బ్రతుకవలెనని నిరాశతో పిల్లలకు కూడా సుఖముండదను యోచనతో పిల్లల వేసి తానుపడి చని పోవు దురు. దీనికి కారకుడు చంద్రుడు చంద్రుడు పాపియై అష్టమాధిపతియై పంచమములో నుండి, అష్టమములో పాప గ్రహమున్న జీవులు ఇట్లు చేయుదురు- ఇది నీటి గండము శుభ గ్రహ వీక్షణ గలిగిన గండము గడచి బైటు పడుదురు.

శ్రీ- ఏ ఏ లగ్నముల కిట్లు తటస్థపడుదురు.

గు- సింహ ధనుస్సులకు గురు లగ్నములలో శని లగ్నములలో మకర, కుంభ, వృషభ, మిధున కన్యలకు స్థానాధిపత్య దోషమువల్ల పాపిగాన చంద్రునితో అష్టమాధిపతులు చేరిన ఇట్టి విపరీత బుద్ధులు పుట్టును. చంద్రుడు ధనుస్సు కొక్క-టికే అష్టమాధిపతియగు చున్నాడు. చంపను స్వతంత్రుడు తతిమ్మా లగ్నములకు తోడు గావలయును. శుభ గ్రహ వీక్షణవల్ల గండము తప్పిపోవును.

శ్రీ- బస్సులు, వ్యాన్‌లు రైళ్లు ఒకటి కొకటి డీకొట్టి కొందరు చనిపోతారు. కొందరు మిగులుతారు. ఏ గ్రహము వలన అందురు.

గు- వాహన కారకుడగు శుక్రుడు పాపియై చతుర్ధ దశమముల నుండి తోడుగా అష్టమాధిపతి వుండినను చూచినను ఇట్టి. దుర్మరణాలు కలుగును. మీన లగ్నమున కొకటికే శుక్రుడు అష్టమాధిపతి యగును. చంపను స్వతంత్రుడు. తతిమ్మా గురు లగ్నములకు అష్టమాధిపతి తోడు గావల యును. ఆ పత్రికలలో చతుర్థమునకు శుక్రుడు శుభ గ్రహ వీక్షణ కలిగినవారు బ్రతుకుదురు. శని పాలితులకు చిల్లర దెబ్బలు తగిలి బ్రతుకుదురు. గురు పాలితులు వాహన

గండముతో స్త్రీ గండముతో చనిపోవుచుందురు. దెబ్బలు తగులుచుండును.

శ్రీ- కొందరు సునాయాసముగా చనిపోవుదురు. వారికి గ్రహము లెట్లుండును.

గు- వారి జాతకములో ద్వాదశమందు లగ్న పంచమ భాగ్య స్థానాదిపతులుందురు. వారు వృద్ధాప్యములో దైవ ప్రార్థన నమ్మకముతో చేయుచుందురు. లేదా ముందు జన్మలో చేసిన పుణ్యము వలన సునాయాసముగ మరణము కలుగును.

శ్రీ- కొందరు ఫలాన తేది ఇన్ని గంటలకు చని పోతానని చెప్పి పోతారు. వారి జాతక మెట్లుండునందురు.

గు- వీరుచేసిన దైవశక్తి వలన అష్టమ శుద్ధి కలిగియున్న వారుగా నుందురు. వీరు పూజనీయులు వందనీయులుగా నుందరు. వీరికి పంచమ, నవమ ద్వాదశమములలో లగ్న పంచమ, నవమ స్థానాదిపతుల కలయిక వుండి చంద్రుడు శుభుడై యుండును. పాప గ్రహదశలు అయిపోయి నిష్పా పత్వము కలిగి ఉండును. ఉదాహరణ :- తులా లగ్నమునకు ఆశ్లేష నక్షత్రములో ఆఖరునజన్మించి గురుదశ స్వభుక్తి పోయినంత వరకు జీవించి యుండిన నిష్పాపత్వము కలుగును. అట్టి వారు అణి మాదృష్ట శుద్ధి గడించిన మహనీయులు వీరు పూర్వ పుణ్య జీవులు.

శ్రీ- కొందరు మల మూత్రములలో పొర్లాడి ప్రాణము పోక ఏండ్ల తరబడి జీవించి గృహస్తులకు విసుగు జనింతురే వారి జాతకమెట్లుండును.

గు- వీరికి చతుర్థమున నొక పాపగ్రహము షట్ స్థానాదిపతిగాని ఉండి ద్వాదశములో నొక పాప గ్రహమున్న వారు రోగ, గ్రస్తులై చాలాకాలము మల మూత్రములలో పొర్లాడి గృహ

స్తులకు విసుగు జనింపచేసి చని పోవుచుందురు. ఇట్టి వారికి బుధగ్రహము ప్రబల పాపిగా నుండి పక్షగత వాయువును గాని దేహములో సర్వాంగములు తిమురుతో స్పర్శ లేక పోవుటగాని ఉండి మల మూత్రములు వచ్చుట తెలియకుండ పోయి పడివుండు వారుగా నుందురు.

శ్రీ- వార్జూపి చెట్టుకు అధిష్టాన దేవత ఎవరు?

గు- వార్జూపి చెట్టుకు అదిష్టాన దేవతలక్ష్మి కాన వాకిటి ముందు వేసి కొనుచున్నారు. అందులో ఓషదులు అనేకమున్నవి.

శ్రీ- ఇటికలు వేయుటకు కోయుటకు అమ్ముటకు ఏ గ్రహ బల ముండ వలయునందురు.

గు- మట్టికి, కట్టెకు, రాయికి, కుజుడదిపతిగాన, కుజుడు చతుర్ధ దశమ లాభ స్థాన లగ్నము లందుండి శుభుడుగా చతుర్థ భావ మందుండ వలయును.

శ్రీ- కొందరు విదేశములకు ప్రభుత్వ ధనముతో పోయివస్తారు. ఏ గ్రహ బలము వల్లనందురు.

గు- చంద్ర బలము చక్కగా నుండి సూర్యుడు సూర్య క్షేత్రము శుభులతో చూడబడి చతుర్ధము శుభ స్థితిలో నున్నవారు గొప్ప మేధాశక్తి గలవారుగా నుందురు. వారిని ప్రభుత్వము కొన్ని విషయములు సంగ్రహించు కొనుటకు వంపుదురు.

శ్రీ- స్వామి కొందరికి ఆనె కాళ్లు, కొందరికి బోదకాళ్లు, కొందరికి ఏనుగకాళ్లు వస్తాయి. ఏ గ్రహము వల్ల నందురు.

గు- వత్సా, ఆనెలు అరికాళ్ళలో వచ్చును. పాదమునకు అదిపతి శని, శని పాపియై ద్వితీయ ద్వాదశమము లందుండిన అరి కాళ్ళలో వచ్చును. శుభులతో చేరిన శుభులు చూచిన

మొలువవు. బోదకాళ్లు వట్టికాళ్లు సన్నగగుట దీనికి కుజుడు పాపియై ద్వితీయ మందుండిన ఒకకాలు సన్నగగును దీనిని బోధ కాలందురు. ఏనుగ కాలుకు శని ద్వితీయమును చూచి బలవంతుడై యుండవన వచ్చును. శుభుడు చూచిన రాదు ఒకరికి ఒక కాలుకు వచ్చును. మరొకరికి రెండు కాళ్ళకు వచ్చును.

ఏల్నాటి శని - గురు బలము - శని బలము శని ద్వాదశ - లగ్న - ద్వితీయముల సంచరించినపుడు ఏడు న్నర సంవత్సరములు భాదిస్తాడు. అని అన్నారు. అందరు చెప్పుచున్నారు. ఇది ఇస్సన్న చెప్పిన వేదమని అన్నవారు లేరు. అనుమాన మొచ్చినను పెద్దల మాటను తీసి వేయ రాదని దానికి తగిన ప్రమాణములు లేవని వారి పద్ధతినే ఆచరణలో నుంచుకొన్నారు. శాస్త్రము తలక్రిందులైనది - ప్రతి లగ్నమునకు ఏల్నాటి శనియని జోస్యులు చెప్పు చున్నారు. గురుబలము, శనిబలము నాకు ఎట్లున్నదని ప్రజలు అడిగినపుడు ద్వాదశ లగ్నములకు శని చెడ్డవాడని చెప్పుచున్నారు. అందువల్ల జోస్యుడు మాట దక్కించు కొలేక పోతున్నాడు. జోస్యము దెబ్బ తినుచున్నది. గమ నించవలసిన పద్ధతి - శని, శుక్ర, బుధులు ఒకరి నొకరు పంచమ నవమాదిపతులగు చున్నారు. లగ్నాదిపతికి పం చమ నవమాదిపతులే మిత్రులు ఇతరులు శత్రువులు గురు కుజ రవి చంద్రులకు పంచమ నవమాదిపతులే మిత్రులు ఇతరులు శత్రువులు, శని శుక్ర బుధులకు - గురు కుజ రవి చంద్రులు పంచమ నవమాదిపతులుగా ఎక్కడా లేరు. గురు కుజ రవి చంద్రులు శని బుధ శుక్రులు పంచమ నవమాది పతులుగా లేరు. అందువల్ల ఆ లగ్నములకు లగ్నాది పతు

లకు మిత్రత్వము లేదు. శత్రుత్వమే గలదు. - దీని వలన మకర కుంభ మిథున కన్య తులలకు ఏల్నాటి శని లేదు. మీన మేష కటక వృశ్చిక సింహ ధనస్సులకు ఏల్నాటి శని

కలదు గాని శని పాలిత లగ్నములకు మకర కుంభ వృషభ మిథున కన్య తులలను ఎడున్నర సంవత్సరములు సర్వేశ్వరుడై కాపాడును. ఉన్న ఇంటిని చూచెడి ఇండ్లలో గల ఫలముల అభివృద్ధి చేయును - గురువు తన మిత్ర గృహములగు మీన మేష కటక వృశ్చిక ధనుస్సు సింహములకు వచ్చి నపుడు సత్ఫలితముల నిచ్చును - మకర కుంభ వృషభ మిథున కన్య తుల లగ్నములకు దుష్ ఫలితముల కలి గించును. - ఎల్నాటి శని ద్వాదశలగ్నములకు ఉన్నదనుట పొరపాటు చెప్పి వప్పింపజాలడు - గురువు ద్వాదశ లగ్నములను భాదించుననుట మరింత పొరపాటు ద్వాద శాష్టమ జన్మంతు అన్న శ్లోకము రచించిరేగాని ఫలానా లగ్నములకు అని తెలుపలేదు. ప్రాథమిక విద్య తెలియ నందున గురు బలము శని బలము గ్రహించక తీసి వేసినారు. ఉదా :- ఆంధ్రరాష్ట ముఖ్యమంత్రి గారి జాతకము తుల శని తులా లగ్న ప్రవేశమైన తోడనే పదవి ప్రవేశ మయినారు. ఏల్నాటి శని పట్టి యుండిన ప్రభుత్వ రంగ ప్రవేశము చేయిజాలరు - ఒక శతాదిక గ్రంథకర్త తులా రాశికి శని దోషికాదన్నాడు. గొప్ప పంచాంగకర్త తుల రాశికి శని ఎల్నాటి శని అన్నారు. వారెట్లు శుభు లన్నారో వీరెట్లు ఏల్నాటి శని అని అన్నారో వారికే తెలియును.

మకర కుంభ వృషభ మిదున కన్య తులలకు ఎల్నాటి శని లేదు. జీవితాశయముల మెరుగు పరచును

పోషించును. ఈ లగ్నములకు గురువు మూడు ఎడులు పీల్చి పిప్పి చేయును. మీన మేష కటక సింహ వృశ్చిక ధనుస్సులకు గురువు శుభుడై రక్షించును. శని ఈ లగ్నముల వారికి ఏల్నాటి శనియై భక్షించును. ప్రతి లగ్నములకు త్రికోణాదిపతులే రక్షణీయులు. వారి పూర్వ పుణ్యము త్రికోణాదిపతు లందే యున్నదని తేలుచున్నది. లగ్నమునకు త్రికోణాదిపతులే మిత్రులు పూర్వ గ్రంథములలో పంచాంగములలో నిర్ణయించిన శత్రు మిత్రత్వములు గురు శుక్ర బుధ చంద్రులు శుభులనియు రవి కుజ రాహు కేతు గ్రహములు నైసర్గిక పాపులనియు గ్రిహ విభజన చేయుట వల్ల శాస్త్రము తలక్రిందులై నదని తెలియుచున్నది. గ్రహములలో నైసర్గిక పాపులు లేరనియు స్థానాదిపత్య దోషము చేత పాపియన బడునేగాని పాపులు లేరని గనబడుచున్నది. ఉదా :- మీన లగ్నములకు షట్ స్థానాదిపత్య దోషమాపాదించుట చేత సూర్యుడు పాపి. ధనస్సుకు నవమాదిపత్యము వల్ల శుభుడు, ఇట్లే అన్ని గ్రహములకు ఉన్నదని తెలుసు కొనిన జోస్యము ఫలించును. ఊర్ధ్వగతి పట్టును. లేక పూర్వుల ననుసరించిన అధోగతి తప్పదని నా పరిశోధనలో అనుభవములో తేలుచున్నది.

శ్రీ- స్వామి! కాలము నడుపునది గ్రిహములా పాలకులా ప్రజలా?

గు- వత్సా, మేష లగ్నము భూమి ప్రపంచము మేష లగ్నమునకు షట్ స్థానమునకు అనగా కన్య రాశికి శని వచ్చినది మొదలు ప్రజలలో శత్రు రోగ ఋణ విపత్తులు అప మృత్యువులు ప్రతి గ్రామములో కలహములు విపరీత

మైన ధరలు వ్యాపారస్తుల దొంగ నిలువలు దొంగ రవాణాలు ప్రజలలో క్రోధము మోహము లోభము మధము చెలరేపుట దుర్లాభములపై ప్రజల మనస్సు నీడ్చుట అంతః కలహముల కల్పించుటనిత్యావసర వస్తువులు చిక్కక ప్రజలు భాద నొందుటు సప్త వ్యసనముల వీర వీహారము చేయించుట పాపభీతి పరమాణువులేని నాస్తికుల సృష్టించుట అతి వృష్టి, అనావృష్టి గలిగించుట సృష్టించును. ధనిక నిర్ధనిక కలహములు ప్రజా ప్రభుత్వ భావ విభేదములు ఉద్యోగ నిరుద్యోగ అసూయలు యుద్ధ భయింకరములు పలువిద గండములు ప్రాణ నష్టములు చోర భీతి ప్రతి దేశమునకు యుద్ధ భీతి ఇట్టివి అనేకము కన్యారాశి దుష్ఫలము శని గలించుచు చున్నాడు. ప్రజల వలనకాదు. పాలకులవలనకాదు.

శ్రీ- స్వామి! ముప్పది యేడుల కొకసారి కన్యారాశిలో శని ప్రవేశించును గదా అప్పుడంతయు ఇట్లే చేసినాడందురా!

గు- ఔను 1949 నుండి 53 వరకు కాలము ఎన్ని తైతక్కలాడినదో వెను దిరిగి చూడుము. ఆనాడు విరోది వికృతి వచ్చినది. ఈనాడు రౌద్రి వచ్చినది. ఇట్లే సంవత్సరములో పేర్లు క్రూరముగానే ఉండును. గ్రహములు కాలము నడుపునపుడు మానవులు కారణమాత్రులు బుద్ధి : కర్మానుసారిణి అన్య వాక్యము కాలమునకు కూడవచ్చును. దీనిని కొంత వరకు మార్పు చేయునది దైవశక్తి గ్రహరూపే జనార్దన గ్రహరూపే మహేశ్వర అని వున్నది గాబట్టి సంకల్ప యుతముగా దేవాలయములో పూజలు చేయుట శ్రేయోదాయకము, పూర్వము ఇట్టి విపరీత కాలములలో దైవముపై ఆధారపడు చుండి నారని జ్యోతిషము చెప్పుచున్నది.

శ్రీ— స్వామి! సంగీత సాహిత్యములు వీణా ఫిడేల్ హార్మో నియము సంగీత వాయుద్యములకు శుక్రుడధిపతి యనియు, తపాల మృదంగములు డోలు తప్పెలు డక్క మొదలగు లయతో చేరిన చర్మ వాయుద్యములకు బుధుడధిపతి అన్నారు. ఎక్కడెక్కడ గ్రహము లుండవలయును.

గు— వత్సా, శని పాలిత జాతకమునకు శుక్రుడు లగ్నాత్ పంచమ నవమ దశమ ఏకాదశమములో నుండినను పంచమాధిపతి అట్టి శుక్రుని చూచినను నవమాధిపతి చూచినను నీవడిగినవే కాక ఇంకా వేణువు ఈల పాట మొదలగు వాటిలో సంపాదించును. దీనికి తోడు దశమములో ఏక శుభ గ్రహమున్న కీర్తి గౌరవములలో జీవించును – శని పాలిత జాతకములకు ఇవి అన్ని లభించి జీవింప చేయును. శని వలన శుక్రుని వలన నృత్యము తటస్థించును. చతుర్థ దశమములలో శని శుక్రలున్న రంగ స్థల నటకులగుదురు. సినిమా రంగస్థలమున వన్నె గడింతురు. గురు పాలితులకు రాణింపక జీవితమును నాశనము, చేతురు. వృధాకాలమగును.

శ్రీ— స్వామి, కొందరికి హర్ణియ కొందరికి బుడ్డ కొందరికి వరబీజము కొందరికి బీజములు కరిగి పోవుట తటస్థించును. స్త్రీలకు హర్నియా వచ్చును. కొందరికి ఆయమునకు ఇరునాగుల గడ్డలు పేగు జారుట పొక్కుట లోపుల కురుపులు లేచుట తటస్థ పడును. యే గ్రహము వలన అందురు?

గు వత్సా! ఈ జబ్బు గురు పాలిత జాతకులకే తటస్థించుచుం చుండును. శని పాలితులకు శుక్ర గృహములు రెండు శుక్రుడు పాపులచే బంధింపబడి యుండిన వచ్చుచుండును. శుక్ర దశలలో శుక్ర భుక్తులలో వచ్చును. ఓషదులతో

బాగుపడు యోగము కలదు. పంచమములో ఒక పాప గ్రహ ముండిన శస్త్ర చికిత్స జరుగును. పంచమాధిపతిని పాప గ్రహము చూచినను శస్త్ర చికిత్స జరుగును. ఓషదులు చక్కగా లేని కాలము కాబట్టి దానితో భాధపడు యోగ ముండు జాతకుడు కాబట్టి చక్కని ఓషది లభించదు.

శ్రీ- అగ్రికల్చరల్ కాలేజిలో చదువు కొనుటకు గ్రిహము లెట్లుండును.

గు- వత్సా, జాతకునకు కుజుడు కుజ క్షేత్రములు శుభ స్థితిలో నున్న వారు చదువుదురు. పోలీసు మిల్టరీ [దేశ రక్షకులు] ఫారెస్టు [అడవి] రివిన్యూ భూమి ఇవి కుజుని బలముతో చేరుచుందురు. 14, 68, 9, 10 గృహములలో బలముగా నుండిన కుజుడు లభించును.

శ్రీ- స్వామి, కొన్ని చోట్ల విఘ్నేశ్వరుని రాగిచెట్టు క్రింద ప్రతిష్ట చేసినారు. శాస్త్ర సమ్మతమేనా

గు- నాయనా విఘ్నేశ్వరుడు ప్రమధ గణాధిపతి ఈశ్వరాంశ గాన జమ్మి చెట్టుకు అధిపతి ఈశ్వరుడు. జమ్మి చెట్టుకు క్రింద మంచిది. రాగి చెట్టు విష్ణు పరమైనది. కాన పనికి రాదు. చేయరాదు.

శ్రీ- సుబ్రమ్మణ్యస్వామికి నాగులకు జమ్మి చెట్టు మంచిదే నందురా.

గు- ఔను ఈశ్వర పరివారమునకు జమ్మిచెట్టు విష్ణు పరి వారక మునకు రావిచెట్టు శ్రేయోదాయకము. గంగమ్మకు వేప చెట్టు మంచిది. వేపచెట్టుకు పార్వతి అధిపతి. గాబట్టి సర్వ శక్తులను వేపచెట్టు క్రిందనే నియమించుచున్నారు.

శ్రీ- స్వామి, గంగమ్మ ముండమోపి అని కొందరనుచున్నారు తమ రేమందురు.

గు- వత్సా, బాల్య యౌవన కౌమార వృద్ధాప్యమను నాల్గు దశలలో స్త్రీలకు బాల్యమునకు చంద్రుడు యౌవన కాలమునకు శుక్రుడు కౌమార దశకు చంద్రుడు వృద్ధాప్యమునకు శని కారకులగుటయు శక్తి స్వరూపమగుట వల్లను జోస్యమున శనికి విధవత్వము గలుగుటవల్లను శక్తిని విధవా స్వరూపమని నిరూపించినారు లయకారిణి కత్తి బట్టిన చేయిగాన విధవగా పూజించు చున్నారు ఇది సహజమే,.

శ్రీ- స్వామి, శ్రీ విద్య అంటూ వుంటారు దీని విషయమేమంటారు.

గు- వత్సా! పార్వతి బహు రూపములతో బాల, బగళా, త్రిపుర సుందరీ దుర్గ కాళి రుద్రకాళి మొదలగు శ్రీదేవతా ఉపాసనను శ్రీ విద్యా, అంటారు. శ్రీ విద్య ఇహమున వన్నెగడించుటకు, పరలతుకు తోడ్పడుటకు కాగలదు, ప్రయోగములన్ని శ్రీవిద్య వల్లనే నెరవేరచుచున్నది. అందువల్ల శ్రీవిద్య అనుచున్నారు.

శ్రీ- గంధర్వులు యక్షులు గుహ్యకులు భూతములు అనేకము శివాంశయందు జననమన్నారు. నిశ్చయమేనా.

గు- గంధర్వులు నాట్య కళలకు సంగీతమునకు ముఖ్యులు గాన శివాంశయే గాని విష్ణు అంశకాదు.

శ్రీ- శుభా శుభులు ఒక రాశిలో కలిసి వుండినపుడు పాపులు ముందై శుభులు వెనుకై ఉండినపుడు శుభుల దశ ముందు జరిగి పోయిన ఆ స్థానము శుభత్వము చెందుతుందా, మిగిలిన పాప గ్రహదశ యోగిస్తుందా,

గు- పాప గ్రహదశ పోయి శుభుడు మిగిలిన ఆ స్థానము చూచెడి స్థానములు యోగించును. సుభ గ్రహదశ పోయి

పాపగ్రహము మిగిలిన ఉన్న స్థాన ఫలము చూచెడి స్థాన ఫలములు నాశనము గాగలవు.

శ్రీ- శుభా శుభులు కలిసి వుండినపుడు శుభ గ్రహము ముందై పాపగ్రహము వెనుకై యుండినపుడు పాపగ్రహ దశపోయిన ఆ స్థానము శుభత్వము చెందగలదా,

గు- వత్సా, శుభాశుభులు కలిసి వుండినపుడు పాప గ్రహదశ పోయిన శుభుడు బలవంతుడై శుభ ఫలములనే యివ్వ గలుగును.

శ్రీ- ఒక రాశిలోన తొమ్మిదవ పాదము చివరలో వుండే గ్రహము యొక్క ఫలము ఆ యింటి ఫలము చెప్పవలెనా, లేక ముందున్న యింటి ఫలాన్ని చెప్పవలయునా,

గు- శని పాలిత జాతకములకు సుక్రాంక్షవచ్చుచు గాన బలము గానే వుండును. గురు పాలితములకు దుర్బలముగా నుం డును. రెండవ యింటి ఫలమే ఎక్కువగా నుండును. పక్క యింటిపైన ఆధారపడును.

శ్రీ- జన్మ లగ్నము కోనలో 4, 5 నిమిషములుండగా జన్మిస్తారు అదే లగ్నము యొక్క ఫలము చెప్ప వలయునా లేక ద్వితీయ స్థాన ఫలము చెప్పవలయునా,

గు- లగ్న నిశ్చయము చేసుకొని జన్మ లగ్నమునే చెప్పవలెగాని ద్వితీయ స్థాన ఫలము చెప్పరాదు.

శ్రీ- ప్రపంచము పుట్టినప్పుడు గ్రహము లెట్లున్నది ఏ నక్షత్ర ములో ఏ లగ్నములో ప్రారంభము వీరికి యుగములకు దశా సంవత్సరములు తెలుపుడు.,

గు- వత్సా, ప్రపంచము పుట్టునప్పుడు త్రిమూర్తుల అంశమున నవ గ్రహములు జనించెను. విష్ణు అంశమున గురు కుజ రవి, కేతు గ్రహములు శివుని అంశమున శని శుక్ర బుధ

రాహు గ్రహములు బ్రహ్మ అంశమున చంద్రుడు పుట్టబడి నవగ్రహములై ప్రపంచపాలనము చేయుచున్నారు. త్రిమూర్తులు త్రిదేవులు కారణ మాత్రులై చూచుచున్నారు నవగ్రహ కేంద్రములు మానవులు చేయు పాప పుణ్యముల గ్రహించి శుభా శుభముల గల్పించుచున్నవి, ద్వాదశ రాసులలో ఆరు రాసులు మీన మేష కటక సింహ వృశ్చిక ధనస్సులు విష్ణువు, మకర కుంభములు వృషభ మిదునములు కన్య తులలు శివుడు విభజించుకొని చావు పుట్టుకల గల్పించుచు హరి హరులన బడుచున్నారు. ఆకలి, నిద్ర కామములు సృష్టికి మూలము ఇవి, యౌవన కారకులకు కుజ శుకు లకు వప్పచెప్పి సృష్టిని గల్పింపజేసినారు. ఆ సృష్టి నిలయి మొనర్ప శనిని నియమింప జేసినారు. ఆయుర్దాయము శనికి తెలియక తీరదు. ఆయుః కారకుడు శని శని చంద్రుని చూచినప్పుడు లయము కుజ గురువులు చంద్రుని చూచి నపుడు పుట్టుక సకల జీవరాసులకు కలుగుచున్నది. చంద్రు నికి సస్యాధిపత్యము యిచ్చినారు, జంగమ స్థావరములను సృష్టించు శక్తి చంద్రునిది, జ్ఞానము అధికారము ప్రజా పాలన మొదలగు బలము సూర్యునికి యిచ్చిరి, శత్రు రోగ ఋణ విపత్తుల గల్పించు బలము బుధునికి యిచ్చిరి, ధనము ధర్మము యజ్ఞము యాగము దైవశక్తి మొదలగు శుభ కార్య ములు ముక్తి మొదలగు పరంతు శుభములు గురువునకు యిచ్చిరి వృత్తి ఉద్యోగ జీవనములు శనికి యిస్తు ఉప జీవ నము దురాదాయము ఆస్తిలకై ప్రాకులాడుటయు లంచాలు తీసుకొనడము అన్యాయము చేయడము మొదలగు పాప స్థానములు 10, 11 ఇండ్లు శనికి యిచ్చినారు, మానవుడు తన జీవనము కొరకై ఏన్నో పాపములు చేసి మోక్షమునకు

పోనివ్వని స్థానములు 10, 11 అనేక పాపములు చేసి పశు పక్షి క్రిమి కీటకాదులలోకి దిగజారి పోతున్నాడు. సృష్టికి మూలము, ఆకలి నిద్ర కామములు ఈ మూడింటికి కొరకై జీవులు ఎన్నో అన్యాయములు చేసి దిగజారి పోవునట్లు చేయుచున్నాడు. ఇట్లు కలియుగములో అర్ధకాలము రెండు లక్షల పదహారువేలు సంవత్సరములు నడుచును. అప్పటికి మానవులు చీను తిన్నంత ఆహారము తిను వారగుదురు. 10, 11 ఇండ్లలో పాపము చేయనివారు ఉత్తమ పదవిని నాక్రమింతురు, అట్టి కాలము వచ్చుట చాలా దూరములో నున్నది. కలియుగములో శుక్రభుక్తి నడుచుచున్నది. ఇది యిక 270 యేండ్లు పట్టును. అటుపై సూర్యభుక్తి వచ్చి కాలము చక్కగా నడుపును, కలియుగ ప్రమాణము 432000,లు ఇందులో అయిదువేల చిల్లర అయిపోయినది.

| | | | |
|---|---|---|---|
| | కు | శు | బు |
| | ప్రపంచ సృష్టిలో గ్రహములు | | చ |
| శ | | | ర |
| గు | | | |

ప్రపంచము అశ్వని నక్షత్ర ప్రధమ పాదములో సృష్టి, గ్రహ దశా సంవత్సరములకు కృత్తిక మొదలన్నారు. ఇది చక్కగా నడుచుచున్నది, సూర్యుని మొదలుకొని దశలు

గ్రహములు లెక్కించినారు. దశా సంవత్సరములు-శుక్రునికి ఇరవై శనికి పంతొమ్మిది రాహువుకు పదునెనిమిది. బుధునికి, పదిహేడు, ఇక్కడికి డెబ్బై నాలుగు సంవత్సరములైనవి-గురువుకు పదహారు కుజునికి ఏడు, చంద్రునికి పది సూర్యునికి ఆరు, కేతువుకు ఏడు, వెరసి నలబై ఆరు సంవత్సరములు రెండు కలిసి నూట ఇరవై సంవత్సరములు మానవుని ఆయుః పరిమాణము-బాల్య యౌవన, కౌమార వృద్ధాప్యములను కాలములో గ్రహ బలమును బట్టి ఆయుర్దాయము కలుగుచున్నది. శనిపాలితులకు ఆయుస్సు యెక్కువ గురు పాలితులకు ఆయుస్సు తక్కువ, మొత్తము పైన పండును. దశపోని లగ్న పంచమ నవమ స్థానాధిపతులు అష్టమములో నుండిన సంపూర్ణ ఆయుర్దాయము గలుగును.

శ్రీ— స్వామి, కృతయుగములో మత్స్య, కూర్మ వరాహ, నారసింహ, వామనావతారములు త్రేతాయుగములో, పరశురామ శ్రీరామ అవతారములు. ద్వాపరములో బలరామ, కృష్ణావతారములు, కలియుగములో కలికావతారము అన్నారు. ఇంకా యిది కానరాలేదు. నిశ్చయమేనందుర.

ఔను, వత్సా' కృతయుగములో రవిరాజుగాను గురువు మంత్రిగా వుండి పరిపాలన చక్కగా చేసినారు. ఇది స్వర్ణ యుగము, త్రేతా యుగములో కుజుడు రాజుగాను, శుక్రుడు మంత్రిగా వుండి నందున ధర్మము తగ్గి రాక్షస మయమై రాజుకు మంత్రికి సరిపోని కారణమువల్ల, చిక్కులేర్పడినవి, ద్వాపర యుగములో, చంద్రుడు రాజుగాను బుధుడు మంత్రిగాను ఏర్పడి ఒకరికొకరు సరిపోని వారుగా నుండుట వల్ల పాలన చెడిపోయినది కలియుగమునకు శని రాహు కేతు గ్రహపాలన గాన ధర్మము సత్యము శౌచము శీలము

మొదలగు వాటిని నశింపుచేసి సప్త వ్యసనముల చెలరేపి వర్ణా శ్రమ ధర్మముల అడుగంటించి, పాప భీతిలేని ప్రజల పుట్టించుచుందురు ఇదియుగ ధర్మము గ్రహ ధర్మము, యుగ కాల పరిమాణములు సందే హాస్పదములోనున్నవి

శ్రీ— స్వామి, తొలి కాన్పు తల్లిగారి ఇంటనే జరుగ వలయు నంటారు దీని భావమేమి?

గు— వత్సా, గర్భ సమయములో శ్రీ తల్లిగారి ఇంట నుండిన ఉత్సాహము సంతోషముండును. కోరికలు తీర్చు కొన గలు గును. సంతోషము వలన గర్భస్థ పిండము చక్కగా పెరు. గును. ప్రసవ సమయములో చక్కగా చూడగలరు. విప త్తులకు చక్కగా తోడ్పడగలరు. జీవితము చక్కగా నడుచు నని చెప్పెదరు-అత్త వారింట కొన్ని చిక్కులుండుట. కోరికలను తీర్చువారుండరు. ఉత్సాహము సంతోష ముండు టకు వీలుండదు. అందువలన శిశువు చక్కగా పెరుగ బోదని చెప్పినారు మొదటి కాన్పు తల్లిగారికి శక్తి గలిగిన మాతృ స్థానము శ్రేయమన్నారు.

శ్రీ- స్వామి, అన్ని కాన్పులు తల్లిగారి ఇంటిలోనే జరుగవల యును. మా ఇంటిలో జరుగు ఆచారము మాకు లేదను వారున్నారు. ఇది అచారమే నందురా!

గు- శ్రీ వత్సా, ఇది లోభతనము ధర్మ విరుద్ధము ఓర్పు శాంతము లేని అత్తవారిల్లని సంఘమునకు తెలియును. ఇందులో అప ద్ధర్మము కూడా ఉన్నది, భార్యా భర్తలు ఇరువురే వుంచిన అట్టిది ఉండును. గాని మనుషులుండి అమ్మగారి ఇంటికి పంపించుట అ ధర్మము.

శ్రీ— స్వామి కొందరు విదేశాలకు పోయి గొప్ప ఉద్యోగము చేసి

దండిగా ధనము సంపాదించి తిరిగి వస్తారు. కొందరు అక్కడనే స్థిరపడతారు. గ్రహము లెట్లుండును.

గు- వత్సా, విదేశాలకు పోవుటకు చంద్రబలము అవశ్యకము చతుర్థ దశమములలో చంద్రుడు శుభుడై బలముగా నున్న వారు పోవుదురు. పోయి సంపాదించు వారికి తిరిగి వచ్చు వారికి పంచమములో లగ్న పంచమ నవమ స్థానాదిపతు లుందురు. స్వగ్రామమునకు తిరిగి రాబట్టుదురు. పంచమములో పాప గ్రహమున్న వారు అన్య ప్రదేశములలో గాని అన్య గ్రామములలోగాని నివసించ వలసి ఉండును. గాన వీరు అక్కడనే స్థిరపడుదురు. ఉద్యోగ స్థానములో గ్రహములు ఎంత బలముగా నుండిన అంతటి ఉద్యోగము సంప్రాప్తించును.

శ్రీ- స్వామి, చతుర్ధ స్థానమున పాపగ్రహ ముండినప్పుడు ఆ గ్రహమును ప్రక్క చూపుతో శుభ గ్రహమును చూచేనేని ఆ స్థానము శుభత్వమగునా?

గు- ప్రక్క చూపుతో చూచెడి చూపు పాపగ్రహముపై పూర్తి పడినట్లయిన ఆ స్థానము శుభ ఫలమిచ్చును. పాపగ్రహము చూచెడి స్థానము పాపత్వమే చెందును.

శ్రీ- పుట్టిన బిడ్డను ఉయ్యాలలో వేయుటకు ఏ స్థానమున శుభ గ్రహము లుండవలయును.

గు- చతుర్థ స్థానమున శుభ గ్రహముండవలయును. గురు పాలిత శని పాలితముల గమనించి చతుర్థమును చూడ వలయును.

శ్రీ- స్వామి, మెదడు వాపు జబ్బు వచ్చి కొందరు పిల్లలు వెంటనే చనిపోతారు .కొందరు బ్రతుకుతారు. కారణము ఏ గ్రహము వలన అందురు.

గు- చంద్రుడు చంద్రస్థానము పాపత్వము చెంది ఆ చంద్రుని అష్టమాధిపతి చూచినవారు చనిపోదురు. శుభ గ్రహము చూచినవారు బ్రతుకుదురు. పడిశము పట్టినప్పుడు మజ్జిగ మాంసము శిరస్నానము తటస్థ పడుటవల్ల జ్వరము వచ్చును. అది అప స్మారకమునకు దారి తీయును. మెదడులో నీరు చేరి జ్ఞానశక్తిని నశింపుచేయును. జ్ఞానమునకు దేహమునకు సంబంధము లేక పోవును దీనిని మెదడు వాపనుచున్నారు. పిల్లలకు పడిశము, భేదులు, మూత్రములో సుద్దపడుట దృష్టి ఇవి తలి దండ్రులు గమనించవలయును-నూటికి 50 మందికి వుండును. దీనికి తగినమందు లేకున్న అపాయము,.

శ్రీ- కొందరికి పిచ్చి పట్టి భాద నొందుచుందురు. ఏ గ్రహము వల్ల నందురు.

గు- పిచ్చి పట్టుటకు అనేక కారణములున్నవి. శత్రు రోగ ఋణ విపత్తులవలన పరాభవమువలన ఆలోచనతో నిద్ర పట్టక పయిత్యము ప్రలోపించి పిచ్చి పట్టును. దీనికి కారణము బుధుడు బుధక్షేత్రము పాపత్వము చెంది వుండవలయును. మధ్యలో బాగు పడుటకు ఆ పాపదశ పోయిన బాగు పడుదురు. లేకున్న బాధ నొందెదరు.,

శ్రీ- కొందరికి మూర్ఛ వచ్చి జీవితాంతముంటుంది. కొందరికి మధ్యలో ఒషదులవలన పోతుంది. ఏ గ్రహముల వలన అందురు.

గు- చంద్రుడు కటకము పాపత్వము చెంది కటకములో 6, 8 ఇండ్ల గ్రహములున్ననూ చంద్రుడు పాపిగా నుండిననూ పాపగ్రహము పూర్ణ దృష్టితో చూచిననూ మూర్ఛ వ్యాధి వచ్చును. అక్కడ శుభత్వము మేర్పడిననూ ఆ దశలు

పోయిననూ తగ్గిపోవును. ఆ గ్రహములు పోకుండిన జీవితాంతముండును. ఆ స్థానములకు శుభులు గోచార రీత్యా కటకములో ప్రవేశించినపుడు తగ్గును. పాపులు వచ్చినపుడు ఎక్కువగా నుండును.

శ్రీ– కుష్టు రోగము ఏ గ్రహముల వలన కలుగునందురు.

గు– వత్సా! కుజ శనుల వలన కలుగును. కుజ శనులు ఒకచోట కలియుట వలన కుష్టు గడ్డలు చర్మ వ్యాధులు మానని కురుపులు దద్దులు మంగులు పొడలు మొదలగు మేహ వ్యాధులు కలుగును గురు పాలితులకు కుజుడు ముందై శని వెనుకై కుజ క్షేత్రములు రెండింటిలో పాపులున్న గురు జాతకులకు పైన చెప్పిన వ్యాధులు కలుగును. శని పాలితులకు శని ముందై కుజుడు వెనుకై ఉండిన కడుపులో గడ్డలు మలలు నూతులు ఆనెలు ఏనుగుకాలు గలుగును.

శ్రీ– పసిరికలు [కామిలా] వచ్చుటకు గ్రహములు తెలుపుడు.

గు– శని చంద్రులు కలయిక వలన పడిశము పడిశము వలన జ్వరము జ్వరముతో అపత్య దోషమువలన అస్థిగత జ్వరము అప్పటిలో అపత్య దోషము వలన కన్నులు పచ్చనగుట వాపులు వచ్చుట రక్తము పాలి పోవుట కలుగును. చంద్ర శనులు ఇరువురూ పాపులైన లగ్నములకు ఎక్కువై బాధించును. ఒకరు శుభులై మరొకరు పాపులైయున్న తొందరగా బాగుపడును. మిశి మీరిన పాండువు మృత్ పాండువుగా మారును, గ్రహముల యొక్క బలా బలముల ననుసరించి యుండును.

శ్రీ– స్వామి, పుట్టుకతోనే కాళ్లు కొందరికి చేతులు కొందరికి లేక పుట్టుతారు. ఏ గ్రహము లోపమువల్ల.

గు– కుజుడు కుజ క్షేత్రములు పాపత్వము చెంది 6, 8 లో

పాపులున్న చేతులు ద్వితీయ ద్వాదశములలో పాపులున్న కాళ్లు లోపించును

శ్రీ- బస్సు క్రిందపడి బండి క్రిందపడి కాళ్లు చేతులు పోతాయి కారణము.

గు- శుక్రుడు పాపియై కుజునకు వెనుకై యుండిన శుక్రభుక్తిలో దశలో వాహనము వలన పోవును. చతుర్థమును శుభులు చూచిగాని ఉండిగాని వుండిన తిరిగి వచ్చును. పాపి వుండిన ఖండమై పోవును. బుధ కుజులు ఒక్కచోట వుండి గురు జాతకులకు బుధుడు వెనుకై శని జాతకులకు కుజుడు వెనుకై యుండిన అస్పత్రిలో శస్త్ర చికిత్సతో తీసివేయుదురు

శ్రీ- స్వామి, స్త్రీ పురుషుల మర్మ స్థానములందు జబ్బు వస్తుంది కొందరికి కొంత కాలమునకు బాగౌతుంది. కొందరికి జీవితాంతముండును. ఏ గ్రహము వలన.

గు- శుక్ర గ్రహము పాప గ్రహమై ద్వితీయ అష్టమములలో లగ్న సప్తమములలో చతుర్థ దశమములలో బలియుడై యుండిన పురుషులకు వర బీజము బుడ్డ హర్నియా వడిశ వృషణములు కరిగి పోవుట కలుగును. స్త్రీలకైన మర్మ స్థానమునకు ఇరు వాగుల గడ్డలు వచ్చుట పేగుజారుట మర్మ స్థానములో కురుపులు లేచుట పొక్కులు గలుగుట నలుపు వచ్చుట గలుగును. శుక్రదశ పోవుటగాని శుభ గ్రహము చూచుటగాని వుండిన మధ్యలో ఔషదముల వలన నయమగును.

శ్రీ- ఎట్టి కుక్కచే కరువబడి కొందరు చనిపోతారు. చికిత్స చేత కొందరు బ్రతుకుతారు. ఏ గ్రహము వలన.

గు- చతుర్థమున అష్టమ షట్ స్థాన ద్వాదశ స్థానాధిపతియై బలముగా కుజుడు వుండిన పిచ్చి కుక్క కరిచి చికిత్స చేయ

కూడి చచ్చెదరు. ఆ కుజునికి శుభగ్రహ వీక్షణుండిన మంచి కుక్క కరచును. మానిపోవును.

శ్రీ– ఉరిశిక్ష విధింపబడువారికి గ్రహము లెట్లుండును.

గు– అష్టమమున పాపిష్ఠయై కుజుడు బలముగా నుండి చతుర్థమున నొక పాప గ్రహముండి ఆరింట నొక పాప గ్రహమున్న ఉరి శిక్షతో చనిపోవును. అష్టమమును నొక శుభ గ్రహము చూచిన శిక్ష విధింపబడి హైకోర్టులో తొలగింపబడును. తుపాకులు బాంబులు శని జాతకులపై ప్రయోగించిన వాటి వలన శని జాతకులు చావరు – గురు జాతకులపై ప్రయోగించిన తప్పక చచ్చెదరు.

శ్రీ– లగ్నాధిపతి అస్తంగతుడైన బలముండునా.

గు– ఏ గ్రహమైన అస్తంగతమైన దుర్బలత్వ మేర్పడును. ఆ గ్రహముయొక్క కిరణములు భూమిపై తక్కువగా పడును. ఏ గ్రహమైన వక్రించిన వెనుకకు జరుగును. గాని బలముండును. ఋజుగతి అనగా దుర్బలము చెందెననుట రాశ్యాది అనగా ముందున్న రాశిలో నున్నాడనుట–వక్రత్యాగ:అనగా వక్రగతి అయిపోయినది ముందుకు నడుచునని వక్రా రంభ మనగా వక్రించుట ప్రారంభమగును.

శ్రీ– సంస్కృతము చదువుటకు గ్రహము లెట్లుండును.

గు– గురు గ్రహముగాని శుక్రుడుగాని బలముగా పంచమములో నుండి బాల్యమున వారి దశలే వచ్చిన సంస్కృత విద్య లభించును. ఊహానాశక్తి ప్రబలముగా నుండు పండిత బలముగాని కవిత్వ బలముగాని పొందును.

శ్రీ– నాకు తల్లికిగాని తండ్రికిగాని కర్మ చేయు సమయమున్నదా లేక బంధుమిత్రుల కర్మలలో పాల్గొను యోగమున్నదా అని అడుగుతారు. ఏ గ్రహము లుండవలయును.

గు— కర్మ కారకులు-గురు శనులు గురు జాతకులకు పదింటికి శని వచ్చినను శని జాతకులకు గురువు దశమమునకు వచ్చినను కర్మ తల్లికిగాని తండ్రికిగాని చేయుట సిద్ధించును. చతుర్థమునకు వచ్చిన బంధు మిత్రాదుల కర్మలలో పాల్గొనవలసి వచ్చును.

శ్రీ- సంవత్సరము లోపల శిశువుకు పండ్లు రాకూడదు. అట్లు వచ్చిన గృహస్థులకు కీడని లోకులంటారు. నిజమెంత.

గు— ప్రకృతికి విరుద్ధముగాన ఏ జాతకుడో తెలుసుకొని దేవునికి అభిషేకము చేయించి ఆ తీర్థము పిల్లవానికి త్రాపిన దోష పరిహారమగును, శని బలీయుడై శుభుడై సప్తమములోనున్న కొందరికి వచ్చును. అది దోషము గాదు. కాళ్లు లేక చేతులు లేక కన్నులు లేక పుట్టుతారే అది ప్రకృతికి విరుద్ధముగాదా! పండ్లు అట్లు వచ్చుట మేనమామకు కీడని లోకవాడిక ఉన్నది. ఏమిలేవు.

శ్రీ- ఆప్రేషన్ చేయించు కొనువారికి ముందు కలిగిన బిడ్డల ఆయుర్దాయము బాగున్నదా లేదా అని తెలుసుకొనుటెట్లు గ్రహ బల మెట్లుండవలయును.

గు— ఆ తల్లి తండ్రులకు బిడ్డలు ముందున్న వారు జీవించు యోగమున్నదా లేదా అని తెలుసుకొనవలయును. రెండవది పుట్టినవారి జాతకములలో ఆయుర్దాయ స్థాన మెట్లున్నదో చూడవలయును. తల్లి తండ్రులకు పంచమములో శుభగ్రహ ముండుటో చూచుటో వుండి దశమములో శుభగ్రహముండుటో చూచుటో వుండిన వంశ వృక్షముండును. పాప గ్రహముండిన వుండదు. కలిగినవారికి అష్టమములో శుభ గ్రహ ముండుటో అష్టమాదిపతిని శుభ గ్రహము చూడుటో కలిగిన ఉన్నవారు చాలా కాలము జీవింతురు.

వంశము నిలుచును. చేయించుకొనవచ్చును. వ్యతిరిక్తముగా చేయరాదు. పంచమములో శుభ గ్రహమున్న ఆప్రేషన్ చక్కగా జరుగును. పాపగ్రహమున్న కొంత బాధ నొందెదు. పంచమములో శుభ గ్రహమున్న సమయము చూచుకొనుట మంచిది. బిడ్డలు చాలునని నిశ్చయము చేసికొని యున్నవారే ప్రసవించునప్పుడే చేయించుకొందురు. వారికి మంచిరోజు ఎక్కడ లభించును. దొరకదు గాన దైవముపైన ఆధారపడవలసి యుండును.

శ్రీ- కొందరు జీవితాంతము వ్యవసాయముపై ఆధారపడి జీవిస్తారు ఏ గ్రహము వలన

గు- బాల్యమున విద్యకు అటంకముల వల్లనో ఉద్యోగ జీవనము చేయు యోగము లేకనో ఉండి చతుర్ధ దశమములలో కుజ గ్రహముండుటో చూచుటో గలిగినవారు భూజీవనము చేతురు. కుజుడు పాపియై యుండిన గుత్తకు కోరుకు చేసుకొని జీవించును. చతుర్ధ దశమములలో పాపగ్రహ మున్న వారు జీవితాంతము కూలీలుగా జీవింతురు. కుజుడు చతుర్ధము చెడిన భూమియే ఉండదు. కుజ క్షేత్రములలో శుభ గ్రహములున్న వారికి కొంచెము భూమి ఉండును. చతుర్ధమున శుభా శుభులు కలిసి యుండిన కొంత మంచిదిగా కొంత బీడు భూమిగ నుండును.

శ్రీ- సన్యాసము పుచ్చు కొనువారికి [సన్యాసులకు] గ్రహములు ఎట్లుండును.

గు- శని చంద్రులు కలిసి యుండడము కాని చంద్రుని కటకమును శని చూడడము వున్నవారికి సన్యాసముపై ప్రీతి కలిగి సన్యాసులయ్యెదరు. వివాహము చేసుకొనుటకు సప్తమాష్టమములలో నొక శుభ గ్రహమున్న వివాహమగును

చంద్రుడు శని విపరీత జ్ఞానము గలిగించి అనుమానింప చేసిగాని వీర్య నష్టమువల్లగాని ధాతువుల దుర్బలము వలన గాని యౌవనము లేక భార్యతో పరాభవింపబడుట వల్లగాని అజ్ఞాత వాసమునకు పూనుకొని సన్యాసులయ్యెదరు. శత్రు రోగ ఋణ విపత్తులతో పరాభవింపబడి సన్యాసులయ్యెదరు. దీనికి కారణము సప్తమాష్టమములలో పాప గ్రహములుండి శని చంద్రుల కలయిక వుండును. శుభా శుభులు సప్తమ ములో నుండి అశుభదశ పోయి శుభదశ వచ్చిన తిరిగి వచ్చెదరు.

శ్రీ- కేతు దశగాని రాహు దశగాని కొంచెము మిగులు ఉండిన ఆ దశా నాయకుడు ఉన్నట్లే నందురా!

గు— ఏ దశకాని మిగులు కొంచెముండిననూ ఆ గ్రహ బలము న్నట్లే తలంచుకొనుము.

శ్రీ— స్వామి త్రాగుటకు ఏ గ్రహ బలము వలననో తెలుపుడు.

గు— వస్త్రా, మత్తు పదార్ధములకు కారకుడు శుక్రుడు ఆ శుక్రుడు పాపియై లగ్న ద్వితీయ సప్తమాష్టమలందు ప్రథమ స్థాన మున బలియుడై ఉండిన దశ పోకుండిన జీవితాంతమువరకు త్రాగుచు ఆస్థిని నాశనము చేయును. ఇట్లు ఉండిననూ చతుర్ధ దశమములో శుభ గ్రహమున్నవారు గౌరవ ప్రతిష్ట లకు హాని కలిగింపక మితముగా ఒకరికి తెలియకుండా త్రాగెదరు. చతుర్థదశమములలో పాపగ్రహము లుండిన కీర్తి గౌరవ మర్యాదల లెక్కింపక త్రాగి భార్యాపిల్లల భాదించి వీది కెక్కెదరు. ఆ శుక్రదశ పోయిన త్రాగుట మాను కొందురు. ఆ శుక్రుడు శుభుడై యుండి త్రాగుడు మరగి ననూ భార్య పిల్లల చక్కగా చూచుకొందురు. గౌరవ ములను పెరచుకొనును. వ్యభిచారముకు శుక్రుడు కార

కుడే యగును. శుభుడై యుండిన పరులకు తెలియకుండా నడచును. శుక్రుడు పాపియైన వూరంతటికి తెలిసి పరాభవము ప్రాణహాని సంభవింపచేయును. జూదమునకు శని బుధులు కారకులు పాపులై సప్తమములోన లాభ స్థానము లోన నుండిన సర్వము పోగొట్టుకొందురు. భార్య పిల్లల దుఃఖింప చేయుదురు - 7, 11 ఇంట శని బుదులు శుభులై వుండిన సంపాదింతురు. ఆడి ఓడిపోయినవారికి షష్టాష్టమము లలో పాప గ్రహములున్న పరాభవముల సహించ లేక ప్రాణము తీసుకొందురు.

శ్రీ- స్వామి, వాస్తులో, వాస్తవ మెంతవరకు అని అడుగు వారున్నారు. ఏమని చెప్పవలయును.,

గు- వత్సా, ఋణాను బంధ రూపేణ పశుపత్నీ సుతాలయ, అన్నవాక్యము మాత్రము నిశ్చయమేగాని శాస్త్రము తప్పుడు పోరనబడి ప్రజలలో నమ్మకము చెడినది-జ్యోతిశ్శాస్త్రములో వాస్తు అంతర్భాగము, పరమాణువు - జ్యోతిశ్శాస్త్రములో, వేదాంగ జోస్యము పౌరాణిక జోస్యమని రెండు భాగలయినది. వేదాంగ జోస్యము వంశ పరంపరగా వచ్చినది వారు యవరికి చెప్పలేదు. పండితులకు వారికి బుద్ద ద్వేష మేర్పడి కృత్రిమ జోస్యము నొకదాని పాండిత్య బలముతో యేర్పరచుకున్నారు. అది ఏనాడు ఏర్పడినదో గమనించుట కష్టము నామ నక్షత్రముతో ఫలము చెప్పడమునకై, చూచే చోల, అశ్వని, లిలూలెలో భరణీ, అన్నవి 27 నక్షత్రములకు విష వలయు మేర్పరచి చెప్పుచున్నారు. రామారావు, రాఘవయ్య, రమణయ్య, రామోజి అనగా రాతో చేరుకున్న పేర్లన్నిటకు [పేపోరారి] చిత్త, అని చిత్తార్థం, కన్య చిత్తార్థం, తుల మూడవ అక్షరం రా, గాన తుల నుండి ఫలము

ఫలము చెప్పుచున్నారు. అందులో గురువు శుక్రుడు శుద్ధ బుధుడు, పూర్ణచంద్రుడు శుభులని, శని, రవి, కుజ రాహు కేతు గ్రహములు పాపులని నిర్ణయించుకొనుట చేత జ్యోతిష గ్రంథములే ఆ ప్రమాణములయినవి. వాటిని అభ్యసించిన వారెంతటు వారైన అడిగెడివారికి చక్కని సమాధాన మియ్య లేక పోవుటచేత జ్యోతిశ్శాస్త్రమున్నదా లేదా అనే అనుమానము గలుగుచున్నది. వేదాంగ జోస్యము వంశ పరంపరగా వచ్చి ఆగి పోయినది. కృత్రిమ జోస్యము ముందుకు వచ్చి, ఫలితములు శూన్యమైనవి.

ఇక వాస్తు క్రమ బద్ధముగా తెలుసుకొనుటకు జ్యోతిషము చక్కగా తెలిసి వుండవలయును - అది లేక కృత్రిమ వాస్తుల గల్పించినారు. వీటివల్ల శుభా శుభములుగాని సుఖ దుఃఖములుగాని మంచి చెడ్డలుగాని తెలుసుకొనుట కల్ల పృచ్ఛకుడు వచ్చి నేను భవనము కట్టగలనా, మహడీ వేయ గలనా, వసతి గృహమా, సామాన్య గృహమా, ఛిద్ర గృహమా శిథిల గృహమా, స్థలములో ప్రకృతము యేమున్నవి. ఈ స్థలము ఎందరిని మార్చినది, గృహము వంశ పరం పరగా వుండునా, విక్రయమగునా, ఎన్ని భాగాలుగా కట్టగలను. ఈ స్థలము స్త్రీల పేరుతో నున్నదా, పురుషులదా, మైనర్లు తకరార్లు గలవా, లేదా, లోను, అయకము పెట్టినారా, లేదా, స్థలము సమ చతుష్కోణమా, దీర్ఘ చతుష్కోణమా, వలయాకారమా, వంకరయా, ఎత్తు తగ్గు లేమయినా గలవా, త్రికోణమా, పంచకోణమా, స్థలము చదులు పట్టునదియా, దారులవల్ల నీటివల్ల అటంకము లేమయినా గలవా' అన్న ప్రశ్నల వర్షమునకు తాళు కొనవలయును. స్థలము చూడకనే ఉన్న చోటునుండియే, చెప్ప గలిగినది

వేదాంగవాస్తు, ఇది నశింపై కృత్రిమ జోస్యము గృహ వాస్తు, జలవాస్తు, గ్రామవాస్తు, దేవాలయవాస్తు, నవగ్రహ వాస్తు మొదలుకొని సర్వము ప్రక్క దారిలో పడినవి, అను మానాస్పదమైనవి, జ్యోతిషము అంజన ఓషధీ ప్రభావము, మంత్రాంగములు స్వచ్ఛముగా నుండిన కలియుగము నడు వదు, ప్రజలు ప్రభుత్వోద్యోగులు, స్త్రీలు, పురుషులు, పాప పుణ్య విచక్షణ జ్ఞానము లేని వారుండునది కలియుగముగాన ఈ నాలుగు వుండిన యెవ్వరే పాపము చేయుటకు వీలు గలుగదు, యుగమే, శని, రాహు, కేతువుల పరిపాలన సర్వులు పాప పంకిలమున పొరలక తప్పదు- కృతయుగము సత్యయుగము-కలియుగము అసత్యయుగము త్రేతా, ద్వాపర ములు సత్యా సత్య మిశ్రిత యుగములు శాపాను గ్రహశక్తి గల బ్రాహ్మణులానాడు, మంత్రానుష్టానమే యరుగని బ్రాహ్మణులీనాడు, ఒక్క అంజన వుండిన కలి ప్రభావ మును అరి కట్టవచ్చును. శాస్త్రములు అ ప్రమాణములుగా, సృష్టిగా వలసి వచ్చి, మారినవి.

శ్రీ— స్వామి, మేషమునకు లగ్నాధిపతికి అష్టమస్థానము, నవ మాధిపతికి ద్వాదశ స్థానమున్నది. మేషమునకు దోష మందురా!

గు— లగ్న పంచమ, నవమాధిపతులకు 6, 8, 12 స్థానములు వచ్చిన అవి దోష స్థానములు గావు. లగ్నాధిపతి అష్టమ ములో నవమాధిపతి ద్వాదశ మందున్న మేష లగ్నమునకు దోషము లేదు. వృషభమునకు షట్స్థాన దోషము లేదు. మిథునమునకు అష్టమ, ద్వాదశ స్థాన దోషము లేదు. కటక మునకు షట్ స్థాన దోషములేదు.- సింహామునకు అష్టమ స్థాన దోషము గురువుకు లేదు. కన్యకు షట్ స్థాన దోషము

లేదు. తులకు అష్టమ దోషము శుక్రునకు లేదు. వృశ్చిక మునకు షట్ స్థాన దోషము కుజునకు లేదు. ధనస్సుకు ద్వాదశ స్థాన దోషము లేదు. కుజునకు లేదు, మకరమునకు షట్ స్థాన దోషము బుదునకు లేదు. కుంభమునకు అష్టమ స్థాన దోషము బుదునకు లేదు. మీనమునకు 6, 8, 12 పాప స్థానములేయగును. లగ్న పంచమ, నవమ స్థానాధి పతులకు పావ స్థానములు వచ్చినను శుభ స్థానములే యగును.

శ్రీ- లగ్నమునకు ఎవరి దశా భుక్తులందు శత్రు రోగ ఋణ విప త్తులు గలుగును. గండములు వచ్చును.

గు- లగ్నమునకు పాప గ్రహముల దశా భుక్తులందు శత్రు రోగ ఋణ విపత్తులు కలుగును. అష్టమ, ద్వాదశ స్థానము లలో పాపులున్న వారి కారకత్వములోగాని ఉన్న గృహము వారి కారకత్వములలోగాని, మృత్యువు దాపురింపచేతురు - చతుర్థము నందు పాపులున్న వాహన గండము గల్పింతురు స్త్రీ గ్రహమగు శుక్రుడున్న వాహన గండమున చంద్రు డున్న నీటి గండము, కుజుడున్న అగ్రస్థానము నుండి క్రింద పడుట పన్నురాయి క్రిందపడు గండము సూర్యు డున్న అగ్ని గండము, ఇట్టే లగ్న పాప గ్రహములు చూపు తుండును. లగ్నమునకు, పాపులెవరో బాగా తెలుసు కొనుము. వివాహ మందు కూడా, పాప గ్రహములు విపత్తులు గల్పించును. చక్కగా గమనించవలయును.

శ్రీ- ఇంటి నుండి వెళ్లి పోయినవాడు, బ్రతికినాడా, చనిపోయి నాడా, వస్తాడా, రాడా, అన్న జాతకమునకు గ్రహము లెట్లుండును.

గు- లగ్న పంచమ నవమాధిపతులు అష్టమాదిపతినిగాని, అష్టమ

మును చూచినా గాని, వుండినా సామాన్యముగా చావడు.
చతుర్థ స్థానమును శుభులు చూచిన తప్పక స్వగృహము
చేరును. చతుర్థమును శుభగ్రహములు చూచినను ఆ చోటికి
శుభ గ్రహము వచ్చినను తిరిగి వచ్చును. ఆ సమయమున
చూడవలయును. పోవుటకు కారణము స్త్రీ గ్రహముల,
పురుష గ్రహముల, శత్రు రోగ ఋణముల వల్లనా, గృహ
చ్ఛిద్రములవల్లనా, అనెడివిషయముల గమనించవలయును-
సప్తమములో పాపులున్నవారికి సంసార చిక్కులుండును.
6, 12 స్థానములలో పాపులున్న వారికి శత్రు రోగ ఋణ
విపత్తులుండును-వీటివల్ల స్వస్థానము విడచును.

శ్రీ రేచేకటి, పగటి చీకటి, దృష్టి తగ్గుట, కంటికి దెబ్బ తగిలి
కాయిగాచుట, పొవుటి పొరలు వచ్చుట, కన్నే పోవుటకు
ఎ గ్రహము వల్లనందురు

గు. శాస్త్ర! కన్నులకు అదిపతి సూర్యుడు గాన సూర్య క్షేత్రము
సూర్యుడు పూర్తి పాపులచే చూడ బడుటగాని పాపులుండి
ననుగాని సంభవించిన కన్నులు పోయి భాధపడును. ఒకటి
వుండి అనగా గ్రహముగాని, స్థానముగాని ఒకటి మిగిలిన
ఒక కంటికి కీడు గలుగును. రేచీకటి, పగటి చీకటి శుక్ల
ములు, మొబ్బుట, వచ్చును. దెబ్బతగిలి ఒకకన్ను పోవును
సూర్యుని ఆదీనములో నున్నవి. సూర్యుడు కౌమారదశకు
అదిపతిగాన ఆ దశలోనే చత్వాది ప్రారంభమగును.

శ్రీ- మేష లగ్నమునకు, కుజుడు పంచమములో వుంటే ఆ దశా
భుక్తులలో ఆప్రేషన్ చేసుకున్న శుభమా! అ శుభమా!

గు- మేషలగ్నము కుజక్షేత్రము లగ్నాదిపోదైవహ, అని
యున్నది, లగ్న పంచమ నవమాదిపతులు ఎక్కడుండినా
ఉన్న స్థానము చూచెడి స్థానములు శుభస్కరముగా నుం

డును. ఆ యా భావములు శుభమై ప్రకాశించును. మేషము లగ్నోత్తమములలో ఉత్తమము గురు కుజ రవి చంద్ర కేతు గ్రహములు శుభులు గాన శుభమే కలుగును.

శ్రీ- మిదున లగ్నమునకు అష్టమాదిపతి శని 3, 7, 10 దృష్టితో సింహ ధనుర్, మీనముల మిదునములో నుండి చూచును గదా? ఆ స్థానములు శుభస్కరములగునా లేక పాపత్వము కలుగునా.

గు- మిధునమునకు అష్టమ నవమాదిపతి శని, లగ్న పంచమ నవమాదిపతులకు పాప స్థానమును వచ్చినను పుణ్య స్థానములుగా మారును. గాన నవమాదిపతి లగ్నములో నుండి చూచిన స్థానములన్ని శుభత్వమే యగును. ఆయా భావములు ప్రకాశించును. మిదునమునకు శని శుభుడు.

శ్రీ- శుభా శుభులు కలిసి ఒక చోటు నుండి శుభులు ముందు పాపులు వెనుక నుండిన శుభుల దశాభుక్తులు యోగించునా!

గు- పాపులకు ముందు పాదములలో శుభులుండి దశాభుక్తులు వచ్చిన ఆయా భావముల నన్నింటి పాపులు నశింపు చేయుదురు. శుభులు వెనుకై పాపులు ముందుండిన పాపుల దశాభుక్తులలో శుభమే కలుగును. వారున్న స్థానముల బట్టి తెలుసుకొనవలయును. షట్ స్థానములో పాపులు వెనుకై శుభులు ముందున్న విపత్తులు అనేకము కలిగింతురు. శుభులు వెనుకై పాపులు ముందుండిన శుభ ఫలమే నిత్తురు. ఇట్లై అన్ని స్థానములలో గమనింపవలయును.

శ్రీ- గండములున్నవారు ఏ దేవుని పూజించిన గండములు తొలగును!

గు- శని పాలితులు శివ పరముగా, గురు పాలితులు విష్ణు పరముగా పూజించుట ధ్యానించుట శ్రేయము త్రిమూర్తుల

త్రిదేవుల పూజించుటలో జాతకుడే పాలితుడో గమనించి దానిని ఎక్కువగా ధ్యానము చేయవలయును. ముందు జన్మలో ఏ దేవుని ధ్యానించి పూజించి పుణ్యమార్జించి మానవత్వం సంపాదించినాడో ఆ దేవుని ఎక్కువ ధ్యానింపవలయును. శివుని ధ్యానించినవాడు శని పాలితునిగా, విష్ణువును ధ్యానించినవాడు గురు పాలితుడుగా జన్మింతురని జోస్యము చెప్పుచున్నది. ఇది నిశ్చయము ముందు ధ్యానించిన వానినే ధ్యానించుచు ఇంతో అంతో అందరిని ధ్యానించి అందరికి నైవేద్య మర్పించిన రాబోవు జన్మకు దేహశక్తి, జ్ఞానశక్తి, ధనశక్తి సమకూరును. ఒకరినే ధ్యానించిన ఒకే శక్తి కలుగును. నిత్యము ధ్యానించి పూజించు వారికి సంకల్పముతో పనిలేదు. గ్రహములకు దాన మీయ వలయునన్న సంకల్ప ముండవలయును.

శ్రీ– ఒక చోట శుభా శుభులు కలిసి పాపులు ముందు శుభులు వెనుక వుండిన ఎవరి దశా భుక్తులు యోగించును.

గు– వత్సా! వెనుక శుభులుండిన పాపుల దశా భుక్తులు కూడా యోగించును. వారి పాపత్వము దశింపు కాగలదు. ఏ స్థానములోనున్న ఆ స్థాన ఫలము లీయగలరు. అరింట కలిసి యుండిన శత్రు రోగ ఋణ విపత్తులు రావు. వడ్డీ వ్యాపారంతోనో, వైద్యముతోనో వ్యాపారంతోనో జీవించును స్థల కారకత్వము, గ్రహ కారకత్వములు కలిసి వుండును. దశమములలో కలిసి వుండిన పాపులు వెనుకై వుండిన వృత్తి వుద్యోగ వ్యాపార గౌరవముల నశింపు చేతురు. శుభులు వెనుక నుండిన సర్వ విధములతో జీవనము అభివృద్ధి చేయుదురు.

శ్రీ– ఆరోగ్యము భంగమగుటకు గ్రహము లెట్లుండును.

గు_ పాప గ్రహములు 6, 8, 12 లో బలముగా నుండి శుభగ్రహ వీక్షణ లేకుండిన శత్రు రోగ ఋణ బాధల కలిగింతురు. శుభగ్రహ వీక్షణ కలిగిన కొంతవరకు నయముగా నుండును ఏడింట పాపులున్న రోగగ్రస్తుల కోప గ్రస్థుల శోకగ్రస్తుల నియమించి గృహములో మనశ్శాంతి లేకుండా చేతురు.

శ్రీ- పాపము చేయనివారికి పుణ్య లోకప్రాప్తి కలిగే వారికి ఫలితము సంపాదించే వారికి గ్రహము లెట్లుండును?

గు_ జాతకములో నవమాధిపతి పంచమములో నుండిన పుణ్య కార్యములు చేయుబుద్ది పాపమును చేయరాదనే తలంపు కొంతవరకు అరికట్టే శక్తి కలుగును. పంచమాధిపతి పంచ మములో నుండిన మంచి కార్యములు చేయుచు దైవశక్తి నార్జింనుకొను మనసు కలిగి శక్తికొలది దైవశక్తిని ఆర్జించు కొనును. ఇతరుల మంచి మార్గమునకు త్రిప్పగలుగును. కీర్తిని గడించును. పుణ్యలోక ప్రాప్తి కలిగే వారికి పంద్రెం డింట శుభ గ్రహముండును. రాదోవు జన్మ మంచిదిగా వచ్చేవారికి ఈ లక్షణములుండును.

శ్రీ- ఈ జన్మలో దైవ దర్శనము కలిగేవారికి గ్రహము లెట్లుం డును?

గు_ పంచమాదిపతి పంచమములో **ఉండి** భాగ్యాదిపతి భాగ్య ములో బలవంతుడై ఉన్న దైవదర్శనము కలుగును, స్వప్న ములో ప్రయాణములో వెన్నంటి యుండి అగుపడును. మానవుడు గ్రహింప జాలడు.

శ్రీ- పాపము లేకుండ పుణ్య ఫలములో జన్మించిన వారికి గ్రహము లెట్లుండును.

గు- పాప పుణ్య మిశ్రితుడు మానవుడు నిష్పాపత్వము కలిగిన వాడు ఈ లోకమునకు రాడు. పుణ్యలోకము నందే నివ

సించును. అవధూత సిద్ధపురుషుడు ఆశ్రమ నివాసులు యోగులు జీవ సమాది అయినవారు వీరందరికి ఇంతో అంతో పాపముండియే ఈ లోకములో ప్రవేసించినారు. శక్తి కొలది పుణ్య కార్యములు చేసి పాపము అయిపోయిన తోడనే తనువు విడచి పోదగిన స్థలమునకు పోయినారు. వీరికి పంచమ, నవమ, లగ్నాదిపతుల కలయిక కొందరికి నవమాదిపతి ద్వాదశములో కొందరికి నుండును.

శ్రీ- కొందరు పురుషులు విడాకు ఓస్తారు. కొందరు స్త్రీలు విడాకులిస్తారు వీరికి గ్రహము లెట్లుండును.

గు- స్త్రీ పురుషులకు సప్తమాష్టమములో పాపగ్రహము లుండుటయు శని చంద్రులు కలిసి ఉండుటయు చతుర్థములో పాపు లుండుటయు నుండును. పురుషుడు స్త్రీని అనుమానించుటయు స్త్రీ గ్రిహములవల్ల జరుగును. స్త్రీ పురుషుని అనుమానించుటకు పురుష గ్రహములుండును. పురుషునికి శుక్ర చంద్రులు పాపులుగా నుండుటగాని పాపులతో చూడబడుటగాని నుండిన పురుషునికి రెండు వివాహములగును. లేదా విడాకులకు దారి తీయును. స్త్రీకి పురుష గ్రహములు పాపులై పాప స్థానము లందుండి చతుర్థమును పాపులు చూడడము ఉండడము కలిగిన విడాకులకు దారితీయును. విడాకులకు కారణములు సప్తమ అష్టమ స్థానములు పాపుల ఆక్రమములు సప్తమాదిపతిగాని అష్టమాదిపతిగాని చతుర్థ దశమములలో నుండి వారి భుక్తులలోగాని దశలలోగాని విడాకులు పుచ్చుకొనునట్లు చేయుదురు.

శ్రీ- ప్రభుత్వోద్యోగము వచ్చుటకు గ్రహములు జాతక రీత్యాగాని ప్రశ్న ద్వారాగాని ఎట్లుండువందురు,

గు- ప్రభుత్వ ధనము ఆర్జించుటకు రవి చంద్ర కుజ గ్రహములు

గాని స్థానముల నాక్రమించిన శని శుక్ర బుధ రాహు గ్రహముల బలముగాని ఉండవలయును. రవి చంద్ర కుజ గ్రహములకు స్థానములకు తెలియక ప్రభుత్వోద్యోగము లేదు. దశా బుక్తులలోగాని గోచార రీత్యాగాని వచ్చును. రాజకీయ గ్రహములగు రవి, చంద్ర కుజులకు సింహ, కటక, మేష వృశ్చికములకు తెలియక ప్రభుత్వ ధనార్జన జరుగదు. శని పాలిత గ్రహములు ఆ స్థానములలో నుండినను చూచినను ప్రభుత్వోద్యోగము వచ్చును.



## ఏల్నాటి శని - గురుబలం - శనిబలము

శని ద్వాదశ - లగ్న - ద్వితీయముల సంచరించి నపుడు ఏడున్నర సంవత్సరము బాధిస్తాడు, అని అన్నారు. అందరు చెప్పుచున్నారు. ఇది ఇస్సన్న చెప్పిన వేదమని అన్నవారు లేరు. అనుమానమొచ్చినను, పెద్దల మాటను తీసి వేయరాదని దానికి తగిన ప్రమాణములులేవని, వారి పద్ధతనే ఆచరణలోనుంచుకొన్నారు. శాస్త్రము తలక్రిందులైనది. ప్రతి లగ్నమునకు ఏల్నాటి శనియని జోస్యులు చెప్పుచున్నారు. గురుబలము, శనిబలము నాకు ఎట్లున్నదని ప్రజలు అడిగి నప్పుడు ద్వాదశ లగ్నములకు శని చెడ్డవాడని చెప్పుచున్నారు. అందువల్ల జోస్యుడు మాట దక్కించుకొనలేక పోతున్నాడు. జోస్యము దెబ్బతినుచున్నది. గమనించవలసిన పద్ధతి శని, శుక్ర, బుధులు ఒకరికొకరు పంచమ, నవమాధిప

తులగు చున్నారు. లగ్నాధిపతికి పంచమ నవమాధిపతులు మిత్రులు ఇతరులు, శత్రువులు - గురు, కుజ, చంద్ర, రవులకు పంచమ నవమాధిపతులు, మిత్రులు, ఇతరులు, శత్రువులు-శని, శుక్ర, బుధులకు గురు, కుజ, రవి, చంద్రులు పంచమ నవమాధిపతులుగా ఎక్కడా లేరు. గురు, కుజ రవిచంద్రులకు శని శుక్ర బుధులు పంచమ నవమాధిపతులుగా లేరు. అందువల్ల ఆలగ్నములకు లగ్నాధిపతులకు మిత్రత్వము లేదు. శత్రుత్వమే గలదు. దీని వల్ల మకర కుంభ వృషభ మిథున కన్య తులలకు ఏల్నాటి శని లేదు. మీన మేష, కటక, సింహ వృశ్చిక ధనస్సులకు, ఏల్నాటిశని గలదుగాని శనిపాలిత లగ్నములగసి మకర కుంభ వృషభ మిథున కన్య తున లను, ఏడున్నరసంవత్సరములు, సర్వేశ్వరుడై కాపాడును. ఉన్న యింటిని చూచెడి ఇండ్లలో గల ఫలముల అభివృద్ధి చేయును. గురువు తన మిత్ర గృహములగు మీన మేష కటక సింహ వృశ్చిక ధనస్సులకు వచ్చినపుడు సత్ఫలితముల నిచ్చును. మకర కుంభ వృషభ మిథున కన్య తుల లగ్నములకు దుష్ట ఫలితములు కురిపించును. ఏల్నాటిశని ద్వాదశలగ్నములకు ఉన్నదనుట పొరపాటు చెప్పి వప్పింపజాలరు. గురువు,ద్వాదశలగ్నములను బాధించుననుట మరింతపొరపాటు ద్వాదశాష్టమ జన్మంతు అన్న శ్లోకము రచించిరే గాని పలానా లగ్నములకు అని తెలుపలేదు. ప్రాథమిక విద్య తెలియనందున, గురుబలము, శనిబలము గ్రహించక, కలేసి కొట్టినారు. ఒక శతాధిక గ్రంథకర్త తులారాశికి శని దోషికాదన్నాడు. గొప్ప పంచాంగకర్త తులారాశికి శని ఏల్నాటిశని అన్నారు. వారెట్లు లన్నారో వీరెట్లు ఏల్నాటిశని అన్నారో వారికే తెలియును.

మకర కుంభ వృషభ మిథున కన్య తులలకు ఏల్నాటి శని లేదు జీవితాశయముల మెరుగు పరచును, పోషించును. ఈ లగ్నములకు గురువు మూడుయేడులు పీల్చి పిప్పిచేయును. మీన,

మేష, కటక, సింహ, వృశ్చిక, ధనస్సులకు, గురువు శుభుడై రక్షించును. శని ఈ లగ్నములవారికి ఏల్నాటి శనియై భక్షించును.

ప్రతి లగ్నమునకు త్రికోణాధిపతులే రక్షణీయులు వారి పూర్వ పుణ్యము త్రికోణాధిపతులందే యున్నదని తెలుచున్నది. లగ్నమునకు త్రికోణాధిపతులే మిత్రులు. పూర్వగ్రంథములలో పంచాంగములలో నిర్ణయించిన శత్రు మిత్రత్వములు గురు, శుక్ర, బుధ, చంద్రులు శుభులనియు రవి, కుజ, శని, రాహు, కేతుగ్రహములు నైసర్గిక పాపులనియు, గ్రహవిభజన చేయుటవల్ల శాస్త్రము తలక్రిందులయినదని తేలుచున్నది. గ్రహములలో నైసర్గికపాపులు లేరనియు, స్థానాదిపత్యదోషముచేత, పాపియనబడునేగాని పాపులు లేరని గనబడుచున్నది. ఉదా:- మీన లగ్నమునకు షట్స్థానాధిపత్య దోషమాపాదించుట చేత సూర్యుడు పాపి, ధనస్సుకు నవమాదిపత్యమువల్ల శుభుడు, ఇట్లే అన్ని గ్రహములకు ఉన్నదని, తెలుసుకొనిన జోస్యము ఫలించును. ఊర్ధ్వగతి పట్టును, లేక పూర్వుల ననుసరించిన, అధోగతి తప్పదని నా పరిశోధనలో అనుభవములో తేలుచున్నది.

కం॥ తను పంచమ భాగ్యాధిప
లను వందగ నొకట కలియ నమృతప్రదమై
దన నివి విననివి తెలిసియు
ఘనుడయి సత్కీర్తి పొందు కనుమావత్సా.



శ్రీ రంగరామానుజ ప్రెస్, తాడిపత్రి.

## శ్రీ వీరబ్రహ్మముంగారి (జీవిత చరిత్ర) నాటకము

నవీన పద్ధతిగా నాటక రంగస్థలమునకు సరిపోవునట్లు అనేక విషయములతో అనేక సందేహముల తీర్చునదిగా జీవసమాధియైన వారి మహత్తు లిట్లుండునని తెలుపునదిగా మానవులకు మంచి మార్గ దర్శక మిచ్చునదిగా సర్వవిషయముల కరతలామలకముగ తెలుపు నదిగ వ్రాయబడినది. చదివి సర్వులు ఆనందింప తగినది.

వెల: రు. 5-00

## సప్రమాణ జ్యోతిస్సారము

ప్రకృతమున్న జ్యోతిషవాస్తు గ్రంథములు కృత్రిమములని నిరూపించి మార్గదర్శకమిచ్చు సద్గ్రంథము జ్యోతిశ్శాస్త్రాభిలాషిగల వారందరు చూడతగినది. ఇదివరకెన్నడు చూడనిది.

వెల: రు. 15-00

## గృహ వాస్తు

ప్రకృతమున్న వాస్తు గ్రంథములు కృతిమములు అపోహము లని నిరూపించి మానవులకు మార్గదర్శక మిచ్చునది. జ్యోతిశాస్త్రము నుండి వెలువడినది క్రమబద్ధముగ నుండునది చూడతగినది.

వెల: రు. 7-50

## * మాతృ జ్యోతి *

ఇయ్యది అమూల్య గ్రంథము 630 పేజీలు బైండుచేయబడినది. సంప్రదాయ విజ్ఞాన జ్యోతియనియు నవలరూపము ధరించిన విజ్ఞాన సర్వస్వమనియు, బహుశాస్త్ర మనియు ఇట్టి గ్రంథము 'నభూతోన భవిష్యతి' యనియు పందొమ్మిదవ పురాణముగా పరిగణింపవచ్చునవియు పలువిధముల కవి పండితులచే పొగడందబడినది. వధూవరులకు వజ్రకవచము, యువతి యువకులకు కామధేనువు, గృహిణి గృహస్థులకు ఉపాధ్యాయ బాలబాలికలకు సంరక్ష. నిత్యనైమిత్తిక కర్మానుష్ఠానులకు చింతామణియని పాఠకులచే అనేక విధముల మెప్పొందినది. ప్రతి యింట నుండతగినది. వివాహ కాలములందు వధూవరులకు ఆశీర్వచనముతో యివ్వదగినది. వెల: రు. 15-00

## [] జ్ఞాన జ్యోతి []

విద్యార్థులకు కల్పవృక్షమువంటిది. నీతి నియమములకు పెన్నిదివంటిది. 100 పేజీల గ్రంథ రాజము. వెల: రు. 2-00

## - గణేశ నారద సల్లాపము -

ఇయ్యది సన్యాసి జన్మ వచ్చుటకు కారణముల తెల్పును. నీతి నియమములు ఎన్నిటునో విరజల్లును. సరళమై మృదుమధురమై చదువరుల కింపుసొంపు నొసగు పద్య కావ్యము. వెల: రు. 2-00

## శ్రీ శారద గణేశ, వరప్రసాద వధూవరులు

ఇది ఒక ఏకాంక నాటిక - ఇందులో వధూవరులు మేనమామ మేనకోడలు - దుర్వ్యసనాలోలుడై సత్ప్రాత్రా చెడిన మామను సక్రమ పరచి వివాహమాడిన మేనకోడలి నీతివాక్యములు ధర్మములనేకము గలది. ఉన్నత విద్య నభ్యసించు విద్యార్థులు ముఖ్యముగా చదువ తగినది. వెల: రు. 3-00

## స్వప్రమాణ జ్యోతిస్సారము (తృతీయ తరంగము)

ముహూర్త భాగము కాలామృతాది గ్రంథములలో నియమించిన ముహూర్తముల ఖండించి క్రమబద్ధమై శాస్త్రసమ్మతమైయుండునట్లు వ్రాయబడినది. అనేక విషయముల తెలుపగలిగినది. వెల: రు7-50

---


## శ్రీ రాఘవేంద్ర జ్యోతిషాలయము

తాడిపత్రి తాలూకా * బొందలదిన్నె * అనంతపురం జిల్లా